# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1958

సంపుటము 35 : : సంచిక 10

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1958



వైజయంతిమాల పద్మిని వీరిని
అత్యున్నత స్థాయిలో చూడండి
జెమినీ చిత్రం
విజయకోట
-తెలుగు-
వీరుడు
అక్టోబర్ 2 మొదలు ఆంధ్ర దేశ మంతటా....






# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
చేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది




అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము



అమృతాంజన్
లిమిటెడ్
మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష లన్నింటిలో జనులకు ప్రోత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! నీవిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములన్
విచ్చిన సన్నజాజియరవిందములన్ కొలువంగనెట్టులో!

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము కొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమునన్ ఉదాత్త రసవార్నిధి తేలెదగాని, పట్టిదా
ర్భాగ్య జగమ్మునన్ నిలువ వచ్చునె? యేకనిమేషమాత్రకై!

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, పన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటగల్పుకొని యంధుకనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుము పూర్వసంస్కృతిన్!

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడనులే!! యిక శంకలేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ!

ఈ గుదిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాగుననైన బోవగ తలంపనిచో నిముసమ్ము యేని నే
నాగగజాలనట్టి చలితాత్ముడనైతినయా! పరాత్పరా!

ఆ శరదిందు చంద్రికల ఆ సికతాతలవేది చేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! నిమేషపు జీవితమ్ములో!

# భారతి

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీఱ వినువీధిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్ముగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర!! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేన నీవయగుచున్ నిత్యప్రబోధమ్ముతో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనేలేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల వల్గి కృశించితి తండ్రీ! నూత్న సం
జీవిని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయవేడెద కృపారస వీక్షణ! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నా కిడినావు గాని
శిథిల మాట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికైన వికసించు నీ మొడంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్ముతోడ
తొడిమవఱకును దీనిని త్రుంచినావు॥

ఏమి మాటగట్టెదవు? కానిమ్ము స్వామి!
ఆగిపోవను క్షణమాత్రమైన జన్మ—
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

లంటే ఒకరోజు, అది నీకు అర్థంకావాలంటే ఒక సంవత్సరం, దాన్ని నువ్వు అమలులో పెట్టాలంటే ఒక శతాబ్దం పడుతుందిరా మై డియర్! కాబట్టి మూడుముక్కల్లో చెబుతాను విను. జీవించడమనేది ఒక కళ ఆ కళని ఆధారం చేసుకుని మూడు ఉపకళలున్నాయి. ఒకటి అప్పుచెయ్యడం, రెండు అబద్ధాలాడడం, మూడు వేషభాషలు ప్రస్తుత నా నిరుద్యోగ నిర్వాణ నిరాహారదీక్షలో ఈ మూడింటిలోనూ గొప్ప ఎక్స్‌పర్ట్‌నైపోయానుకో

రంగ నిజం!

శేఖరం : నిజం. (విషాదంగా) ఏం చెయ్యమంరా బ్రదర్ చెడ్డవాణ్ణి అనుకోకు మనలాంటి మధ్య తరగతి యువకులకి యింతకన్న ఆస్కారం ఏముంది గౌరవంగా స్వేచ్ఛగా జీవించేందుకు మార్గాలు లేవు అలాగ అని స్వతంత్రాన్ని స్వాదయాన్నీ చంపుకోను, ఆశయాల్ని ఆకల్ని కట్టకట్టి పైకు కాలవలో పారేసి జీతం డబ్బులకోసం బ్రతకడమే లేదు—మై గాడ్—నే సహించలేనురా

రంగ అవునుగాని నీకు అప్పు ఎవడిస్తాడంటాడ? మాట యాభైరూపాయల నికరమైన రాబడి సంపాదన వున్నా వాకే పుట్టదు

శేఖరం అందుకే అప్పుచెయ్యడం కూడా ఒక కళ అన్నానురా మిసర్ మాటవరసకి మన ఫ్రెండు గణపతిని ఎరుగుదువా?

రంగ తెలియకేం—ఆర్ అండ్ ఆర్ ఫరమ్‌లో పని చేస్తున్నాడుగా.

శేఖరం వాడికి నువ్వంటే ఎంత గురి, ఎంత గౌరవమూ, ఎంత ఎక్కువమూ ప్రయోజకుడివనీ తెలివైనవాడివనీ

రంగ : అవునవును పాపం వాడికి నేనంటే అమిత అభిమానం.

శేఖరం : అవునా! మొన్న నే సేం చేశానో తెల్సునా. అర్జెంటు అవసరం వచ్చింది ఒక్క పాతికవుంటే యివ్వరా బ్రదర్, మన రంగడు నా కివ్వవల్సిన పాతికా నీకు వెలియా వేస్తాను, పాపం వాణ్ణి ఈ నెలాఖరు రోజుల్లో ప్రెస్ చెయ్యడం నా కిష్టం లేదురా అని ఓ పాతిక రూపాయలు సంపాదించాను

రంగ (తెల్లబోయి) నేను నీకివ్వాలనా? నీ మొహానికి నాకు అప్పుపెట్టే స్తోమతు కూడా వుందా! ఏం గుండెలురా నీవి ఎంత అబద్ధం, పచ్చి పచ్చి అబద్ధం

శేఖరం అబద్ధం పల్లగా ఉండకూరా భాయ్ జర్మన్ సిల్వర్‌లా తళతళమని మెరుస్తూ నిన్ను లోబరుచుకుంటుంది. సత్యం నిజంగా నల్లగా ఎక్కడో మూలపడి ఉంటుంది.

రంగ ఇంత ఘోరంగా ప్రవర్తిస్తావనుకోలేదురా.

శేఖ బంగారు పడకురా రంగడూ ఆపదలందు ధైర్యమున్నాడు ధర్మపాలి అనే అమెరికన్ పొయెట్

రంగ నేను వెళ్ళి గణపతికి నువ్వు చేసిన మోసం చెప్పేస్తాను

శేఖ చెప్పవూ! చెప్పినంత మాత్రాన తల తీసేస్తాడా ఏమిటి—ఇంతకీ స్నేహితుడేగదా! ఏమైనా బ్రదర్ ఒక్క అయిదు రూపాయలుంటే (చెయ్యి చాపుతాడు.)

రంగ (కంగారుగా) ఒరేయ్ నాకే మక్కా కొట్టుకున్నావేమిటి

శేఖ : సారీ (నవ్వుతాడు) అలవాటు చొప్పున అడిగేను 'తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, పుంజేటికొమ్ము సాధింపవచ్చు కానీ చందమామ వచ్చినా రంగనాథునిుండి కానీ రాలదెపుడు' అన్న లోకోక్తి మరిచిపోతుందా

రంగ : థాంక్స్ డబ్బువిగర మనకి చాలా గట్టి అనుభవముంది మిత్రమా!

శేఖ (ఇటూ అటూ చూసి) ఒరేయ్ రంగడూ, ఇంక నువ్వెళ్ళిపో

రంగ ఏం యిక్కడే నిలబెకూడదా.

శేఖ : ప్లీజ్ ఆ అమ్మాయి వచ్చే వేళయిందిరా.

రంగ అమ్మాయా! ఎవరా అమ్మాయి? ఎవరి అమ్మాయి ఇదితిర సుగంధా లేమిటి. సవిస్తరంగా చెప్పు.

శేఖ సుచిత్ర

రంగ సుచిత్ర! లక్షాధికారి రామానాథంగారి అమ్మాయి!

శేఖ : ఎగ్జాక్ట్లీ.

# విచిత్ర ప్రణయం

రంగ : అయితే!

శేఖ ఇంకా నీవు తెలియదురా రంగడూ నువ్వే లోకంలో ఉంటున్నావో నాకు అర్థం కావటం లేదు. భవదీయుడు శేఖరంయొక్క జీవిత చరిత్రలోని యీ గొప్ప అధ్యాయాన్ని విస్మరించావని తెలిస్తే—భావి చరిత్రకారులు నిన్ను మెచ్చరురా

రంగ అసలు సంగతి ఏమిటో ఏడుద్దూ

శేఖ ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. కాలేజీ వదలిన ముహూర్తంనుండీ యిదే మన జీవితాశయం నువ్వొక్కడివితప్ప యీ విషయం తెలియనివాడు మన దేశంలోనే లేడు

రంగ అదేదో ప్రేమించడం అనే పని చేస్తున్నావని తెలుసునుగాని నీ ప్రేమకి లక్ష్యమైన దురదృష్టవంతురాలెవరో తెలియదు. అయినా, నువ్వెందర్ని ప్రేమించెయ్యొచ్చును ఖర్చులేని వ్యవహారం.

శేఖ ఇదా నువ్వు చెప్పేది అసలు నీవు ప్రేమంటే ఏమిటో తెలుసునా! ఆ ప్రేమించే తాహతూ, హృదయమూ నీకు ఉన్నాయా? నువ్వు కీట్సునీ కృష్ణశాస్త్రినీ చదివావా? రాత్రిళ్ళు మల్లెపూలు వాసనచూస్తూ ఏడుస్తూ పక్కమీద దొర్లావా! పోనీ ఎప్పుడేనా చంద్రోపాలంభన అయినా చేశావా! కరకుగట్టిన గుండెగల నువ్వు నా ప్రేమని విరమించడం అంధుడు సూర్యకాంతిని ఆక్షేపించినట్టు ఉంటుంది

రంగ నా మాటకేంకాని, ఏదేనా ఫలితం కనపడుతోందా!

శేఖ : ఆ అమ్మాయి చాలా బెట్టుగా వుంటోంది. ఎన్నో లవ్ లెటర్స్ వ్రాశాను. మా నాన్నకి చెబుతాను, మా ప్రిన్సిపాల్కి చూపిస్తాను అని బెదిరిస్తుంది కాని ఏ ఒక్కటి చెయ్యలేదు. అందుకే మనం అంటే యిష్టమున్నట్టు అదే దాఖలా అనుకో

రంగ అనవసరంగా తానుకూడా రచ్చకెక్కవలసి వస్తుందనే భయంవలన ఆమె గప్‌చిప్‌గా ఊరుకుని వుంటుంది. కాక, అది నీ మీద ప్రేమగా భావిస్తే నీ కామన్‌సెన్సుని గురించి సందేహించవలసి వస్తుంది.

శేఖ : స్త్రీ హృదయం నాకు బాగా తెలుసునురా మిస్టర్! ఆమె పైకి చూపే విముఖత, కోపం వెనుక ఎంత ప్రేమవుందో, ఆమె ప్రవర్తనా, స్వభావమూ చెప్తూనే ఉన్నాయి. ఒరేయ్ బ్రదర్! ఒక్కొక్క ఆడది ఒక్కొక్క రకం వీణ అనుకో ఎవర్ని ఎలా మీటి పలికించాలో అదొక బ్రహ్మాండమైన కళ ఆడది మంచి గంధం చెక్కలాంటిది గంధం చెక్కని రాయగా రాయగా గంధాన్నిస్తుంది. అలాగే ఆడదాని చుట్టూ తిరగా తిరగా ఓ ఫైన్ మార్నింగున 'ఏమండోయ్ మిమ్మల్ని నేనూ ప్రేమించేస్తున్నాను' అని చటుక్కున అనేస్తుంది

రంగ నువ్వు వట్టి ప్రాప్తికజీవివిరా శేఖరం కథలు వ్రాయడానికి, నాటకాల్లో వేషాలు వెయ్యడానికి పనికొస్తావుగాని లోకాన్ని అంచనా వెయ్యలేకపోతున్నావురా ఒకవేళ ఆ అమ్మాయి అంత బుద్ధిలేనిదై నీలాంటి లోఫర్ని ప్రేమించిందే అనుకో, వాళ్ళనాన్న నిన్ను ఓ పెయిర్ ఆఫ్ టాంగ్సు (Pair of tongs) తో ఓ పురుగుని ఏరివేసినట్టుగా ఏరి గోడ అవతలికి విసిరెయ్యడూ!

శేఖరం : ఒరేయ్ నువ్వు చూస్తావుండి చూస్తూ ఎవడికి జీవితంలో గోరున్న నిజమౌతుందని, అన్నీ కాకపోయినా కొన్ని అయినా సఫలీకృతం అవుతాయనీ నమ్మకం పోతుందిరా వట్టి సినికల్‌గా అయిపోతాడు చూడు ఈ అమ్మాయి రామనాథంగారి ఏకైకపుత్రిక అందులో గారాబుపట్టి, అర్ధరాత్రివేళ ఆమె లేచి ఇప్పుడు నాకు సూర్యకాంతి కావాలి అంటే ఈయన తక్షణం గగనమార్గంలోకిపోయి సూర్యభగవానుణ్ణి జబ్బ పట్టుకు తీసుకు వచ్చేస్తాడంటే నమ్ము. అటువంటప్పుడు ఈమెని కాదనగలడా. అరెరె! ఆ అమ్మాయి యిటే వస్తోంది. ప్లీజ్ గెటవుట్.

రంగ ఏదీ ఆవిడ్ని ఒక్కసారి చూడనియ్యి.

శేఖరం : ప్లీజ్. పోరా బాబా (భుజం పుచ్చుకుని లాక్కుపోతూ) అబ్బబ్బ! యీ రోడ్డుమీదైనా

కదా ఈ కళ్లకి. ఈ ప్రకృతి అంతా వసంత శోభల్ని వెదజల్లుతున్నట్టు ఉంటుంది. పచ్చికతో కాలంలో కూడా ఇంత ప్రేమ సుద్దిదిగా అవు తుంది. ఆ చెప్పిన కవి యెవడో కాని

సుచిత్ర : పచ్చకామెర్ల వాడికి లోకం అంతా పచ్చగా కనపడుతుందిట.

శేఖరం మీ రలాగ తీసేస్తే నే నొప్పుకోను ప్రేమ సృష్టికి మూలం ఆదిదంపతులు శివపార్వతుల దగ్గర్నుండి లైలామజ్నూ, రోమియో జూలియెట్

సుచిత్ర (చెవుల్లో వేళ్లు పెట్టుకొని) మీ వాగ్ధోరణి విపరీతంగా ఉంది—

(దబుక్కున వెనక్కి తిరిగి వచ్చినదారి నే కోపంగా నడుస్తూంటుంది)

శేఖరం అరె! ఇంటికే వెళ్లిపోతున్నారే.

సుచిత్ర మీలాంటి పెద్దమనుష్యులు దారులు కాస్తూంటే ఏమిటి చేసేది—ఛీ, సభ్యత తెలియని మొగాళ్లు. నే నింటికే పోతాను.

శేఖరం (రెం డురుకులు వేసి) మళ్ళీ ఇంతదూరం నడిచివెళతారా! పోనీ రిక్షా పిలవమన్నారా

సుచిత్ర (మరమర చూస్తుంది)

శేఖరం కోపంలోనూ మీ కెంత అందం ఏమిటి ఖర్మం మీ రిలా కసిరేస్తూంటే నాకు కాళ్లు నొప్పులు పెడుతున్నాయి మీరు దయచే వాయిస్తారని భయంకాని మిమ్మల్ని భుజాలమీద యెత్తుకు పోవాలని వుంది.

సుచిత్ర (పక్కున నవ్వి) మీకు కేంటే భయం ఉందన్నమాట.

శేఖరం లోకవిధయం సుచిత్రాదేవి ఈ ప్రపంచంలో దేనికీ భయపడను—భయపడలేదు శత్రువులు ఒక్కటే ఊరికి దూరంగా ఏకాంతంగా కూర్చుని గడిపిన రోజులకీ భయపడలేదు దరిద్రానికీ చావుకీ భయపడలేదు కాని మీరంటే.

సుచిత్ర. (ఆశ్చర్యంగా) మీకు జనకాం ఏమీ లేదా.

శేఖరం : లేకేం సుచిత్రా—ఉన్నాయి పూర్వో అప్పులు.

సుచిత్ర : అంత పేదరికంలో ఉండి కాని సంపాదన లేని పరిస్థితిలో మీకు పెళ్ళి ఎందుకండీ?

శేఖరం ఎంత మాటన్నావు సుచిత్రా! ప్రేమ పెన్నిధి ప్రేమించుకొన్న వ్యక్తులకు ఈ సిరిసంపదలూ ఈ భోగభాగ్యాలూ తుచ్ఛాలు కావుటండీ మీకు నేనూ, నాకు మీరూ ఉండగా మరింకేం కావాలి ఒకరి నొకరు చూసుకుంటూ ఒకరు చెయ్యి కేసి ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ ఎన్ని యుగాలైనా గడిపివెయ్యవచ్చును కదండీ.

సుచిత్ర పోనులెండి. మీరు మీ మిత్రులదగ్గర ఒకటి రెండూ అప్పు చేస్తుంటే, నేను పాలుగమ్మ యింగామ్మలదగ్గర కొంచెం బియ్యం, ఉప్పూ, పప్పూ బదులు చేస్తాంటే—

శేఖరం మీ కేం సుచిత్రా. నువ్వు శ్రీమంతురాలివి.

సుచిత్ర అయితే నా ధనం ఆశించి నన్ను చేపట్టాలని చూస్తున్నా రన్నమాట

శేఖరం : కాదు కాదు సుచిత్రా! ఇక్కడ మిమ్మల్నీ, అక్కడ ఆగాఖాన్ ధనాన్నీ, రాక్ ఫెలర్ ఖజానాల్నీ, ఫోర్డు మిలియన్లనీ, నైజాం భాగ్యంలో దాగిన బంగారుకడ్డీలనీ పెట్టి నీకేం కావాలని అంటే, సుచిత్రా అమూల్యమైన గోశ్చే ధనాన్ని యిలాగ కాలితో తన్నేస్తాను. నేను గనాలకి దాసుడ్నయితే, యిన్నాళ్లు యీ వూళ్లో అవస్థలు పడుతూ యిలా ఉంటానా

సుచిత్ర (గర్వంగా) మీలో ఎంత త్యాగశీలమూ సాహసమూ ఉన్నాయండీ

శేఖ (స్వగతం) నాపరిచయం అయిన కొద్దీ మీకు క్రమంగా నాలోవున్న యితర సుగుణ సంపద కూడా తెలియవస్తుంది

సుచిత్ర కాని చూడండి మిస్టర్ నా జీవితవిధానం వేరు నాకు నిరంతరం, సౌఖ్యం, భోగం అలవాటు ఏం కోరినా అది కాళ్లముందు పడాలి మీరన్న ఆ త్రిశుకులాలు నాలో లేవని విచారిస్తున్నాను చీరలు, నగలూ, కార్లూ, నౌకర్లూ—ఇవన్నీ నా కనీసపు అవసరాలు కనీసం వెయ్యిరూపాయిలు సంపాదించగలిగినవాడైతే, నా వివాహానికి అంగీకరించవచ్చును మీకా అర్హతలు లేవని తెలుస్తూనే వుంది మీరు సోమరులు స్వప్నాల్ని భోం చేస్తూ మత్తుగా నిద్రపోయే ఓ రకం సోమరిపోతులు. ఇంక మీరు ప్రయత్నం విరమించడం వివేకమైన పని. నమస్తే. ఇక నన్ను విడిచిపెట్టండి.

(సుచిత్ర వెళ్లిపోతుంది. శేఖరం స్తంభీభూతుడై కొంతసేపటికి తేరుకొని యిటూ అటూ ఆలోచనాసంభ్రమ మనస్కుడై తిరుగుతాడు.)

శేఖరం: నిజం ఎంగరు చెప్పావురా శేఖరం కోటా కడిగేసి గ్లామర్ ని కుడిచేసి ఎందుకు నీ వన్నీ పరిస్థితుల్ని ఆమెకి చెప్పావు. నా చిరిని నేనే చేస్తుకున్నాను నా ఆశలకి నేనే ఉరితాడు బిగించాను ఎంతపని జరిగింది ఎంత సులువుగా చేస్తాగా తన విరసవని యీసడింపుని వ్యక్తం చేసింది ఇప్పుడేంచెయ్యను—

[శేఖరం నిష్క్రమిస్తాడు మరోవైపునుంచి తిరిగి సుచిత్రా, వెనకాల శేఖరమూ ప్రవేశిస్తారు]

శేఖరం సుచిత్రా దేవీ! సుచిత్రా దేవీ!

సుచిత్ర (వెనక్కి తిరిగిచూస్తుంది)

శేఖరం ఇక్కడ యీ రోడ్డుమీద, యీ ధూళిలో పారవేసుకొని వెళ్లి పోతున్నారా!

సుచిత్ర (ఒళ్లంతా చూసుకొని, చేతిసంచీ తెరచి చూసుకొని) అబ్బే, నేనేమీ పారవేసుకో లేదు!

శేఖరం పారవేశారు దేవి, యీదీనుడి హృదయాన్ని చాలా తృణంగా కఠినమైన మీ పదాలతో తొక్కి వెళిపోతున్నారు

సుచిత్ర ఇంక కవిత్వం కట్టిపెట్టండి మాయిల్లు దగ్గరకు వచ్చేసింది ప్లీజ్ గెటవే—

శేఖరం (ఒకటి రెండడుగులు వేసి) అయితే సుచిత్రాదేవి ఒక్క సలహా చెప్పండి మిమ్మల్ని ఇంక బాధించను

సుచిత్ర అయితే ఏమిటో చెప్పండి

శేఖరం జలం మంచిదా, ఎలక్ట్రిక్ తీగ మంచిదా, విషం మంచిదా?

సుచిత్ర ఎందుకూ

శేఖరం: సునాయాసంగా మరణించడానికి శేఖరం అనే అబ్బాయి సుచిత్ర అనే అందమైన దయలేని అమ్మాయిచేత తిరస్కరింపబడి ఆత్మహత్య చేసుకోదలచాడు

సుచిత్ర (నవ్వాపుకొని, ఆలోచనగా) మీరు సైనేడ్ ఎరుగుదురా?

శేఖరం (షాకై) ఏమిటీ!

సుచిత్ర పొటాషియం సైనేడ్ అనే ఒక విషం ఉంది లెండి. అది విషాల్లోకెల్లా రాజులాంటిది ఒక్క చుక్క నాలికమీద వేసుకుంటే వేసుకున్నట్టుగా గప్‌చుప్‌గా పోతారన్నమాట మనవూళ్లో మెడికల్ స్టోర్సులో దొరకుతుంది మరచిపోతారేమో పేరు నోట్ చేసుకోండి పొటాషియమ్ సైనేడ్

శేఖరం (గుండెల్ని పట్టుకుని) ఎంతమాట అన్నావు సుచిత్రా

సుచిత్ర ఇదే మాయిల్లు—గుడ్ బై

శేఖరం (గబుక్కున ఆమె చెయ్యిపట్టుకుని) సుచిత్రా దేవీ

సుచిత్ర (విదిలించుకుని) గెటవుట్

శేఖరం చచ్చినా మిమ్మల్ని వదలను

(సుచిత్రని అనుసరిస్తాడు తెర)

## రంగము-2

* * రామనాథంగారి యింట్లో ముందరి హాలు. ధనవంతుల యిళ్ళల్లో ఉండే అలంకరణ అంతా ఉంటుంది. ఒక పెద్ద డ్రాయరుముందు కూర్చుని రామనాథంగారు ఏవో ఫైల్సు చూస్తోంటాడు సంగీతం మేస్టరు 'పంతులు' పక్కగా నిలబడి ఉంటాడు. రామనాథంగారు ఫైల్సుమూసి ముందుకు వస్తాడు.

రాము: పాఠానికి వెళ్లిన అమ్మాయీ రాలేదు. అద్దెలు వసూలుచేసి యివ్వవల్సిన గుమాస్తా కూడా రాలేదు మేష్టారూ! ఈ కాలంలో సకాలంలో ఏదీ జరగడంలేదు సుమండీ అదే కాలం కాలమహిమ అంటే

పంతులు చిత్తం.

రాము: నిజంగా సకాలంలో అన్నిపనులూ జరగకూడదు సుమండీ అప్పుడు జీవితం యాంత్రికంగా చప్పగా ఉంటుంది చూడండి. మీరున్నారు అమ్మాయికి సంగీతం చెప్తానని

రాము: అదంతా సెటిల్ అయిపోయిందిలే అమ్మాయి స్వయంగా వరుణ్ణి ఎంచుకుంది

శేఖరం: సెటిల్డ్ సెటిల్డ్. (కూలబోయి కుర్చీని ఆనుకుంటాడు)

రాము: అదేం—అలా అయిపోయావేమిటి

శేఖరం: అబ్బే కొంచెం తిప్పిందండి అంతే—మిస్ సుచిత్రా దేవీ కొంచెం వాటర్!

సుచిత్ర: వాటరేనా, మజ్జిగకూడా కావాలా పాపం! (వెళుతుంది.)

రాము: కూర్చోవోయ్ శేఖరం దొడ్లో పని చేయిస్తున్నాను ఒకసారి చూసివస్తాను (వెళతాడు)

శేఖరం: (కుర్చీలో కూర్చుని మొహాన్ని చేతుల్లోకప్పుకుని) మైగాడ్.

సుచిత్ర: (గ్లాసుతో ప్రవేశించి) ఇదిగో మిస్టర్ శేఖర్ టి.బి., వాటర్ (గ్లాసు బల్లమీద పెడుతుంది)

శేఖరం: (కోపంగా చూసి గ్లాసుడునీళ్లూ గటగటా తాగేస్తాడు) హుం!

సుచిత్ర: (ఎదురుగా కూర్చుని) కాగితం కలం తీసుకోండి. నా మ్యారేజికి కావలసిన వస్తువుల లిస్టు చెబుతాను.

శేఖరం: (కదలడు)

సుచిత్ర: మీకే చెబుతున్నది!

శేఖరం: (మాట్లాడకు కుర్చీ మరోపక్కకు త్రిప్పి కూర్చుంటాడు)

సుచిత్ర: మీకు జీతం ఇచ్చేది ఎందుకో తెలుసా? చెప్పినట్లు చెయ్యడానికి

శేఖరం: నేను రాయను

సుచిత్ర: ఏం?

శేఖరం: నా ఇష్టం

సుచిత్ర: మీయిష్టం మీయింటిదగ్గర అయితే ఉద్యోగము మానెయ్యండి.

శేఖరం: నాకు ఉద్యోగం ఇచ్చింది మీరు కాదుగా.

సుచిత్ర: ఎవరైతేనేం—ఇక్కడ నా మాట రాజాజ్ఞ. లేకపోతే డిస్మిస్ చేయిస్తాను

శేఖరం: చిత్త పుర్యోగం. మీరు చెప్పినట్లల్లా వినడానికి నేనేమీ తమ సొంతుణ్ణి కాను. వస్తాడుగా ఓ చవట పదిరోజుల్లో తమ భర్తనంటూ! వాడికి పురమాయించు నీ పనులన్నీ.

సుచిత్ర: (కోపంతో) యూ షటప్ నాకు కాబోయే భర్త నవరూపిపై కక్ష చాలాదూరం వెళుతుంది నా భర్త నాకు దైవసమానుడు మీ అంతస్తు తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడండి

శేఖరం: ఇక నాకు జాగ్రత్తలేదు నాకేం లేదు నా గుండె మండిపోతోంది నేను మానవుణ్ణి కాను, రాక్షసుణ్ణి విప్లవమూర్తిని సుచిత్రా! ఏ దేవిని నేనుసర్వస్వం అని ఆరాధించానో, ఏ దేవి నవ్వుకోసం, కటాక్షం కోసం తల్లడిల్లిపోయానో—ఆమె నన్ను ఓ అనాథశిశువులా పురుగులా విదిలించి పారేసింది నాకింక మంచీ చెడ్డా పాపం పుణ్యం విచక్షణ లేదు ఎప్పటికైనా నా పగ తీర్చుకుంటాను నిన్నూ నీ భర్తనీ కట్టకట్టి గోదావరిలో ముంచేస్తాను.

సుచిత్ర: (ఫక్కున నవ్వుతుంది)

రాము: (వస్తూ) ఎందుకమ్మా అలాగ నవ్వుతున్నావు

సుచిత్ర: 'తిరస్కరింపబడిన ప్రియుడు' అనే నాటకంలో పోర్షన్ చెబుతున్నారు నాన్నా వీరు వీరు నాటకాల్లో వేషాలు బాగా వేస్తారట

శేఖరం: అవునండి. మీ అమ్మాయి చెప్పిన నాటకం పట్టి విషాదాంతం అయిపోయిందండి. అందులోని హీరోయిన్ చాలా దుర్మార్గురాలండి వంచకురాలండి గోముఖ వ్యాఘ్రమండి

సుచిత్ర: హీరో అంతకన్నా దగాకోర్, దొంగ, లోఫర్

రాము: హీరో హీరోయిన్లు ఎటువంటి వాళ్లయితేనేం తల్లీ ఇంతకీ నాటకం కదా.

శేఖరం: వాస్తవిక జీవితంలో కూడా ఉంటారండి అటువంటి మోసకత్తెలు

సుచిత్ర: అటువంటి లేకి పెట్టాసిన కర్తలున్నారు

రాము: నేను మీ ఇద్దరితో నూ ఏకీభవిస్తాను. సరేనా. (సుచిత్ర కోపంగా కూర్చుంటుంది. శేఖరం అంతకన్నా కోపంగా కూర్చొని టేబిలుమీద న్యూస్ పేపరు చదువుకున్నట్లుగా పట్టిస్తాడు. కాని అతని మొహంలోని బాధని దాచాలని ప్రయత్నం ఇదే సమయంలో సుమూర్తి సోమయాజులు వస్తాడు పేపరు అడ్డంగా ఉండడం వలన శేఖరాన్ని చూడలేదు, శేఖరమూ సోమయాజుల్ని చూడడు )

శేఖరం: నాపేరు శేఖరం

సోము: యీపేదాది అద్దె ఎగ్గొట్టిన మహానుభావుడు వీరే నండి బాబూ

రాము: ఇతనా (తెల్లబోతాడు)

సోము: పైగా మీద మీదికి వస్తున్నాడు. అయ్యా! సెలవిస్తేనండి ఒక్క దెబ్బతో యితగాణ్ణి భూమ్మీదికి రప్పిస్తాను

సుచిత్ర: (ఇంతవరకూ వినోదంగా చూస్తోన్న సుచిత్ర పరిస్థితి చాటుతోందని గ్రహించి) వీరే నాన్నా వీరే

శేఖరం: రమణాధంగారూ, నేను నిజం చెప్పేస్తున్నాను. నేను మీ అమ్మాయిని సుచిత్రని యీ రెండేళ్ళనుండీ ప్రేమిస్తున్నాను. ఆమె దయని సంపాదించాలని అన్నీ వదిలేసి యీ వూళ్లో ఉండిపోయాను. పరాయించి యీ సోముణ్ణి మోసగించి ఏడాదినుంచీ అద్దె యివ్వకుండా కాలక్షేపం చేశాను. నేను బి.యే. ప్యాసయ్యాను. నేను దరిద్రుణ్ణి, లోభిన్ని నిజమే కాని ఒక్క అరగంటవరకూ సుచిత్రాదేవి కోసమైనా జీవించాలనే ఆశ ఉండేది. కాని ఆ ఆశ యిప్పుడు సమూలంగా నాశనమయింది. నా మోసాన్ని, నా అల్పత్వాన్ని మీరు ప్రత్యక్షంగా చూసికూడా నన్ను క్షమించి మీ అమ్మాయిని నా చేతుల్లో పెట్టరు. ఇన్నాళ్ళు నేను పడిన శ్రమకి మీ అమ్మాయి హృదయంలో మూడుమూరలంత చోటుకూడా సంపాదించుకోలేకపోయాను. అందని ద్రాక్షకి అర్రులుచాచాను. విఫలమైన యీ ప్రేమ నన్ను దహించివేస్తోంది. నేను తెగించిన మనిషిని. నాకు చావంటే భయంలేదు. కాని యీ సోముణ్ణి నన్ను సుచిత్రాదేవి ముందే అవమానించాడు. అది మాత్రం సహించలేను. ఈ సోముణ్ణి చంపేసి మరీ చచ్చిపోతాను. గుడ్ బై సుచిత్రాదేవి. రారా సోముణ్ణ (మీదికి వస్తాడు)

సోము: న్యా ఏం చేస్తావురా (మీదకొస్తాడు)

సుచిత్ర: (కంగారుగా) నాన్నా విను విను.

రాము: (వదిపించుకోక) ఇది యిలవుకున్నారా నడిబజారనుకున్నారా! (బల గుర్తుతాడు)

సోము: ఆగండి బాబూ వీడిపాగరు ఓ పది దెబ్బలతో తగ్గించేస్తాను. మీరు చూస్తూ ఉండండి.

(ఇద్దరూ కలియబడతారు. సుచిత్ర పేటిలుమీది యూక్రతిని ముందుకు వచ్చి సోముయాబాబు చేతిమీద కొడుతుంది)

రాము: అమ్మాయ్ మర్యాలారా నీ తెంగుకు!

సోము: (విస్మయంతో) అమ్మాయిగారా! అబ్బ! నన్ను కొట్టకేమిటి తల్లి

సుచిత్ర: ఇంకా చంపేద్దువు జాగ్రత్త. ఆయనెవరో తెలుసునా ఆయనే నాకు కాబోయే భర్త

రాము:
సోము: } —ఆం!
శేఖరం:

సుచిత్ర: (శేఖరం చెయ్యి పట్టుకుని) నేను నీకిదివరకు చెప్పింది వీరినే నాన్నా.

రాము: (నమ్మలేక) యితనా! అమ్మా, నువ్వు పొరపాటుపడటంలేదుకద!

సుచిత్ర: నాన్నా వీరినిగురించి నీకు సరిగా తెలియదు డిస్టింక్షను క్లాసులో ప్యాసయ్యారు నాన్నా.

రాము: (సందేహిస్తూ) సరిగా ఆలోచించుకున్నావా అమ్మా

సుచిత్ర: (లాలిస్తూ) ఆయన చాలా మంచివారు నాన్నా నామాట కాదనకు నాన్నా.

రాము: (శేఖరంతో) ఇదిగో చూడు నీ తండ్రి పేరు.

శేఖరం: బ్రహ్మానందం అండి

రాము: బ్రహ్మానందంగా ఉందోయ్. సరే నీ జీవితాశయం ఏమిటి?

శేఖరం: ఇంతవరకూ సుచిత్రాదేవిని వివాహం చేసుకోవడమండి

రాము: ఆ తర్వాత?

శేఖరం: సుచిత్రాదేవిని ప్రతి క్షణమూ సంతోషపరచి ఆమె కదలికలో కవిత్వాన్ని కనుచూపులో స్వరాన్ని సృష్టించడం

రాము: అంటే ఒక స్త్రీకోసం నీజీవితం అంతా వ్యర్థపరుస్తున్నావన్నమాట

శేఖరం: నాకు కోపం తెప్పించకండి జమీందారుగారూ. సుచిత్ర సామాన్య మానవ స్త్రీ అంటే నేను సహించను.

రాము: భేష్ బాగా చెప్పావు. ఇది నీ ప్రేమకి నిదర్శనం అవడానికి సందేహంలేదు. సరే, నీకు వ్యసనాలేమైనా ఉన్నాయా.

శేఖరం: చాలా ఉన్నాయండి.

# మర్యాదలు

శ్రీ జానూతల వేంకటరామమూర్తి

‘చదువుకున్నందుకూ, ఉద్యోగాలు కలిగిఉన్నందుకూ మనం ఒక్కొక్కరైనా కొత్త ప్రాయం చేస్తే దేశంలో ఇంతింత లావాటి సమస్యలు ఉత్పన్నం కావేమో! వచ్చినా సులభంగా తేలిపోతవి!’

‘ఔ నేమో!’ పరధ్యానంలో అనేశాను.

‘నేనెంతటి ముఖ్య విషయం చెబుతున్నానో నీవు అర్థం చేసుకునే స్థితిలో పూర్తిగా లేవని నమ్ము. లేత కన్యలు కట్నాలు ఇవ్వలేక పెండ్లి వాయిదా పడుతూంటే, చాటున కన్నీళ్లు తుడుచుకుంటూ ఎంతగా గిలగిల్లాడుతూ, ఎంతగా తపించిపోతూ మగజాతిని శపించి వేస్తున్నారో ఎప్పుడైనా ఊహించడం జరిగిందా? నీవు కండ్లారా చూశావా!’

‘లేదు!’ అంటూ కండ్లు వాడివైపుకు తిప్పాను. నందకుమార్ కండ్లలో ఎట్టి కోరలు - ధూమాలుగా ఉండేవి కనిపించాయి. కండ్లు ఎట్టి కోరలతో ఉంటం భాగ్యచిహ్నాలని వాడు తరచు అనేవాడు. కుమార్ మళ్ళీ మొదలెత్తాడు, ‘కనీసం ప్రతియువకుడు కట్నం తీసుకోనని ఎందుకు తీర్మానం చేసుకోరాదూ?’

‘ఈ విషయంలో ఒక చట్టంకూడా ఉంది. ఇది చాల పాతపాట! ఇంతకూ నీవు తీసుకోడం జరిగిందా?’

‘ఆఁ, మనసా నిశ్చయించాను. రేపు ఇరవై రెండున నా పెండ్లి!’ అని చెప్పి నందకుమార్, పిలుస్తున్నా వినక వెళ్ళిపోయాడు.

నేను ఆశ్చర్యంతో కూర్చుండిపోయాను!

అతి వైభవంగా వాడి పెండ్లి జరిగిపోయింది. కొంటె ఆర్భటంగా నేనూ చెప్పడంలేదు. పసుపు దారులయిన బట్టలతో, శిరస్సునుండి విస్మయం రాలుతూంటే చిరునవ్వులతో వరావరి నా దగ్గరకు వచ్చి, ‘ఎల్లా ఉందిరా?’ అన్నాడు నందకుమార్.

‘ఏమిటి’

‘నా పెళ్ళాం!’ వాడి ముఖంలో గర్వం, కళ్ళలో తొణికిసలాడు కవళికలు మెరుస్తున్నాయి!

‘నీకు సరిపోతుంది!’

ఇంతలో వాడి పెద్ద బావమరది గబుక్కున వచ్చి ‘ముఖ్యంగా మిమ్మల్ని అభినందిస్తున్నాను. మీలాంటి మిత్రబృందం ఉండటంవల్లనే సంస్కరణాభిలాషలూ, స్వేచ్ఛా ప్రయత్నాలూ కలుగుతుంటాయి. ఇల్లాంటి పుణ్యపురుషుని చూసినప్పుడు నా కండ్లు చెమ్మగిల్లుతుంటాయి. వీరిని నే నేమని అభినందించేది?’

‘చేసిన మొత్తం చాలదూ? కొరతా, నరవా మీ చెల్లెలు చూసుకోగలదు!’ అంటూ పైకి నేను అనలేదు.

నందకుమార్ ఉదాత్తమైన అతని లోచనాలు మా వైపునుండి లోపలవైపుకు ప్రసరించాయి. నేనూ అటే చూస్తున్నాను కాబట్టి, మెరుపులా తళుక్కున మెరిసిపోయిన వాడి మరదలు కనిపించింది.

‘మేము మాడండి ఎంతో కష్టపడ్డాం! ఇక ఒకమోస్తరుగా మనగలిగాము. ఇది సంతోషంగానే ఉంది. మా నాన్న మా కోసం ఏమీ మిగల్చలేకపోయినా, ఇద్దరు పెండ్లాడాల్సిన చెల్లెళ్ళను వదిలిపోయాడు. ఎంత కష్టమో ఆలోచించండి! పూటకూ, బట్టకూ జరుపుకోవడమే బ్రహ్మాండమవుతూంటే, ఇంకా పెళ్ళిళ్ళు ముగించడం సామాన్యమా?’ అని అతడు ఒక నిముషం కూడా విరామం తీసుకోక, ‘నందకుమార్ విశాలహృదయుడు కావడంవల్లనే, ఎవళ్ళకెంత అనిష్టమైనా తన ఆశయాన్ని చక్కగా ప్రదర్శించి కృతార్థుడైనాడు!’ అని అతడు వెళ్ళిపోయాడు.

అతడి ధోరణి, తత్త్వమూ నేను అప్పుడు బాగా అర్థం చేసుకోలేకపోయాను.

‘మంచి బావమరిదినే సంపాదించావ్!’

‘అయినకేంలే! గజెటెడ్ రాంకులేదనేగాని, సెంట్రల్‌లో అంత జీతంవచ్చే ఉద్యోగం!’

‘ఆయన తమ్ముడో!’

‘టీచరీ చేస్తున్నాడు!’

లేక రాతిబొమ్మల్లా కూర్చున్నాను. వాడి ముఖంలోకి చూస్తూ నేను సంభ్రమాశ్చర్యాలకి లోనైపోయాను.

వాడిముఖంలో ఆరిపోబోతున్న దీపానికి మల్లె మలినకాంతులు వ్యాపించి ఉన్నాయి.

చాలసేపటికి తెప్పరిల్లి, 'ఏమిటి ఇల్లా అయావు' అన్నాను.

'ఎల్లా అయ్యాననా? బాగానే వుండాలే! ఏం నీకు బాగా జరుగుతోందా? నేను జీవితంలో ఓడిపోయాను నాకు బంధువులు ఎందుకు లేరనుకున్నాను ఇవాళ నాకోసం ఏడ్చేవాడివి వున్నావను'

'అంటే?'

'ఇంక నేను తండ్రిని కాలేకున్నాను! అంటే రెండు జీవితాల గరిష్ట సమ్మేళనం నామీద ఉందన్న మాట! అన్నట్లు, నీవింకా పెండ్లిచేసుకోలేదేం?' అని మ్లానంగా నవ్వాడు నందకుమార్!

'చేసుకోవాలేనా?'

'నందకుమార్ గంభీరంగా చూస్తూ అన్నాడు. 'అది కేవలం వ్యక్తిగతమైందికాదు ముందు నేను పెండిలి వ్యక్తిగతమైందనే తలచాను కానీ నిజం కాదు నలుగురికీ, ముఖ్యంగా కుటుంబానికంతా సంబంధించిన విషయం అది'

'అంటే?'

'నా విషయం చూడరాదూ? వీళ్ళంతా కృతఘ్నులుగా ఎందుకు అయ్యారంటావు? కేవలం పెండ్లిని నా సొంతవిషయంగా అనుకుని ప్రవర్తించినందువల్ల కాదూ? నాగరాజా ఉద్యోగం చేస్తున్నాడా? హేమ అత్తారింటికిపోయిందా? అన్నయ్య పిల్లాపాపలతో హాయిగా ఉన్నాడా, నాన్న ఇష్టంవచ్చిన దగ్గర నాగరత్నపు హాయిగా ఉన్నాడా? ఇంకా వీళ్ళెందుకు సగబూసావం? ముఖ్యంగా నేను అన్ని విధాలా నష్టపోయాను!' అంటూ నందకుమార్ రెండు చేతుల్లోకి తల తీసుకున్నాడు

నాకు ఏమి చెప్పేందుకూ, చేసేందుకూ తోచలేదు మౌనంతో, సిగరెట్ల పొగలు చేస్తున్న వలయాలు చూస్తూ కూర్చున్నాను

ఎంతో సేపటికి బాగా ఆలోచించి, 'అయితే ఇప్పుడు నీకేమయింది నందా?' అంటూ అడిగాను.

'ఏమయిందా! ఇంకా ఏం కావాలి! నాకు పెళ్లి బాగలేదు. కొద్ది రోజులు గడవకు వచ్చాయి. వాళ్ళ అన్న రెండు ఉత్తరాలు రాసినా, 'పెళ్లి జాగ్రత్తగా చూసుకో! బరువు బిందెలు మోయకు! చిత్తడి నేలలో తిరిగేప్పుడు తప్పక చెప్పులు ఉపయోగించు' అంటూ ఉచిత సలహాలు ఓపికగా ఇచ్చాడు, కానీ 'తీసుకువెళతాను' అంటూ రాయలేదు! తొలిచూలు కాదా, ఆపాటి తెలియనూ లేకపోయింది! అప్పటికి కాన్పుకు కారణ ఇష్టపడలేదు అందువల్ల తీసుకువచ్చాను. నాగరాజా మమ్మల్ని చూసి పలుకులేక బజారుకు వెళ్ళిపోయాడు నాన్న ఇంట్లో లేడు! ఎప్పుడు వస్తాడో తెలీదు'

'కాంతను ఇక్కడకు తీసుకువచ్చావా?'

'ఏమి చేయమంటావ్? అంటున్నా. గర్భంతరం లేకపోయింది నా ఆరోగ్యం తిన్నగా ఉండటం లేదు ఎన్నిరావాలో అన్ని వచ్చాయి తండ్రీ! ఇప్పుడు నాకో దారి చూడు!'

'ఎటు వేపుకు!'

'ఇప్పుడుకూడా హాస్యాలు సాగిస్తావేరా?' ఒడుసుపట్టి చేపలా గిలగిలా కొట్టుకున్నాడు'

'అయితే ఏం కావాలంటావు?'

'నాన్న అగ్నిహోత్రమవుతాడు, గుగ్గిలం మల్లే నాగరాజున్నాడు! వీళ్ళిద్దరి కలయికను ఊహించుకుంటేనే భయంగా వుంది'

'ఇదంతా నీ ఊహ!'

'ఊహూఁ'

అదీగాక నాకు ఊహించేందుకూ ఆధారం ఉంది నామీద ముఖ్యంగా ముసలాయన అలిగాడు నా పెండ్లి నా చేతులేని ఆ చేతో హేమనూ ఒకింటిదాన్ని చేయాలని ఆశపడ్డాడు

దగువుతున్న దగువులో కొంచెం భాగం దొరకుతుందని నాగరాజా పొంగిపోయాడు

కాంతను ఏమీ లేకుండా పెళ్లాడ్డంతో అందరి ఊహాలూ గాలికి చెదిరిపోయాయి!

కానీ, కాలుగోళ్లీ తిరుగుతొచ్చిన నందకుమార్ మీద ముసలాయన ఇంకా కోపంగానే ఉంటాడా? ఇవాళ చలిమిడిముద్దలా దవ్వగా అణగివచ్చిన వీడిని ఆయన క్షమించకపోతాడా? అందులో ఆత్మీయత

# జ్యోతిరవతరణము

శ్రీ బి. రామరాజు

వెలుగులు విచ్చుకొన్నవి, నవ పింఛ మనోజ్ఞమయూర నర్తనో
జ్జ్వల రుచిరంబులై, లలితచాలన హేలలు వాస్తరంగ శీ
తల మృదులంబులై, ఇవము తాకని శ్రీజలజాప్త కాంతి రే
ఖల తొలిజాలులై, ఉషసికట్టిన బంగరు టంచుచీరలై.

మూగిన మల్లె మొగ్గలను మాదిరిగా, లలితేంద్ర నీల మా
లా గలిత స్ఫురచ్చికుర రమ్యముగా, తెలినీటి ముత్తెముల్
తూగని పచ్చగడ్డికొన తూగులుగా, వెలుగుల్ వెలార్చె హాం
సీగరుదంచలాకలిత చిత్ర సువర్ణ ఘృణీకలాపముల్.

ఒక పదివేల శక్రధను రుజ్జ్వల కాంతులు మొట్లు మొట్లుగా
శకలితముల్, నభమ్ముపయి సాగిన నీలిమొయిళ్ళ నిండ వి
చ్చుకొనియె—దుఃఖభావ వివశుండగు జీవుని యార్తి యద్భుతం
బు కనినవేళ కప్పబడిపోవును తద్గత నూత్న శాక్తమై.

ఈ వెల్గుల్ జడివోలె వచ్చె-నిటులే యేకాంచమో సేపు నా
లో విప్పారును వాసనల్, ఎడద్రవాలుగా బుద్ధిపోలున్ జలే
జావాప్తంబుల నేత్రచక్రముల వేలంచుల్ తుదల్ కంటి నీ
రై వ్రేలాడును వేదనానుభవ ముగ్ధాకార పర్యాప్తముల్.

ఏవో ఊహాలు పెల్లగించుకొని యిట్లీ వెల్గులోకాల నీ
మా వృత్తింజననో? పురావిదిత సౌఖ్యాస్వాద ముగ్ధంబులౌ
భావంబుల్ మలినంబులైచనెను, నా ప్రాణంబులన్ నూత్న వర్షా
విద్యుల్లతికా ముహుశ్చలనముల్ రమ్యార్థ సౌగంధ్యముల్

లలితేరమ్మదప్రాణవీధికల హేలా జ్యోతిర్నికాకాశ కే
లులు పారావతముల్ కలన్వనఝరీలోలమ్ములై సాగడిన్
సెల యేరై మృదుకాంతి యొక్కడు మన స్సీమావధుల్ దాటిక్రాం
బులకల్ గూర్చుచు బుద్ధి దేశమున క్రమ్మున్ జీవనస్వాదువై

మత్తానేకప యానలై, సురవరిన్మంజు ప్రసూనాగ్రని
ర్యత్తారుణ్య మధుద్రవ స్పృహాలు, చిత్తానంద సీమావధుల్
మెత్తం జూపుల అచ్చరల్ పరచిరా? మీనాళి పుచ్ఛచ్ఛవుల్
చిత్తాంభోరుహ నాళ కంపన మృదుస్నిగ్ధంబులౌ పైటలన్

చీకటులాక్రమించుకొని జీవన మందున మూలమూలలన్
ప్రాకి, సమస్త భావముల రమ్యత చంపి, క్షణక్షణమ్ముకౌ
శిక మహానుభావమువిపించును, జీవునిలోని కాంతిధా
రా కమనీయ మార్గవితరంబుగ నిల్చును యున్నతల్పులన్

కరగిన చీకటుల్ వెలుగుగా కనిపించును కొందరజ్ఞతా
పరమ నిధానమోహములకు — బంధుర కాంతులుమాసి పోవగా
కరకర చీకటుల్ విరియు, కన్నులు మూతవడంగ చేతన
త్వరధము గోతికూలు తెగవంచిన విల్లుగ ముక్కలై చనున్

అపరోపవన్నమయూర్ధ్రి సూర్య కిరణా హంకారమున్ వార్ధి పీ
చి పురస్తాడన చిత్రవల్గనములై చెల్వొందు కాంతిచ్ఛటల్
ఎపుడో జీవితమందు కానవయి నిల్చినిల్వకుండన్ నిమే
ష పదమ్మందు మనస్సు నవ్యసుషమా స్థానంబుగా దీర్చెడున్

ఈ కాలాణువుకోసమై బ్రతుకు లెన్నో యయ్యె నా జీవిత
ప్రాకారమ్మున, చీకటింబారలు కృత్తానల్పముల్, కాంతి వ
ర్షా కాలంబరుదెంచె, నాయెడద ఈవర్షమ్మునిల్చెన్ మనో
జ్ఞాకాశంబున తోడి స్పర్థపడి నవ్యాంబోధిగా నిల్వగా.

తెలియని సిగ్గుదొంతరలు దివ్యములైన పథాలలోన పా
ముల వలె జారిపోవ నవమోహన గీతము లాలపింతునా?
లలిత పయోధరాంచలములన్ నెలవంకలు దిద్ది తీర్తునా?
మలచి మనస్సులో వెలుగు మార్గములన్ పరుగుల్లుపెట్టనా?

పాట పూర్తయింది. పాటకి ప్రతిధ్వనిలా వయొలిన్ మీద రాగాలాపన సన్నగా వినిపిస్తోంది. విశ్వం తేరుకొని ధైర్యంగా లోపలికి అడుగు వేశాడు. తలుపు చప్పుడు విని వసంత తలెత్తి విశ్వాన్ని చూసి ఆశ్చర్యపడి వయొలిన్ కింద పెట్టి లేచి నుంచుని "కవిగారా!" అంది.

విశ్వం చిరునవ్వు నవ్వాడు

"మీ పాటకి అడ్డొచ్చినట్టున్నాను"

"లేదండీ అలా కూర్చోండి." అంది వసంత

"ఇవాళ మా పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను సెకండ్ క్లాస్‌లో ప్యాసయ్యాను" అన్నాడు. విశ్వం కుర్చీలో కూర్చుంటూ

"చాలా సంతోషమండి" అంది వసంత

"మరి మీ టీపార్టీ సంగతేమిటి?" అన్నాడు విశ్వం కొంచెం చనువు తీసుకుని.

వసంత ముఖంలో విస్మయం తొంగిచూచింది "ఏం టీపార్టీ?" అంది ఆశ్చర్యంగా

"మర్చిపోయారన్నమాట. నేను ప్యాసైతే మీరు టీపార్టీ ఇస్తానన్నారుగా. మరి అందుకే వచ్చాను."

వసంత ముఖం ఎర్రబడ్డది. ఆమెకి తన మాట జ్ఞాపకం వచ్చింది. ముందు ఆ సంగతి తనకి జ్ఞాపకం రానందుకు ఆమెకి సిగ్గుగా ఉంది. తను ఆమాట అన్నప్పుడు చాలా మనఃపూర్వకంగానే అన్నది. తన ఇప్పటి ప్రవర్తన చూసి ఏమనుకున్నాడో ఆయన!

విశ్వం ఆమె ముఖకవళికల్ని గమనించాడు. ఆమె వాగ్దానం మర్చిపోయి అందుకు సిగ్గుపడుతోందని గ్రహించాడు. తను అనవసరంగా ఆమె మనసుకి కష్టం కలిగించాడు.

"ఊరికే అన్నానండి. మీకు నిజముగా నేను ప్యాసయినట్టు చెప్పి పోదామని వచ్చాను." అన్నాడు విశ్వం తన తప్పు సరిదిద్దుకోటానికి ప్రయత్నిస్తూ

వసంత చిరునవ్వు నవ్వుతూ, "నోటీసు ఇచ్చి పోటానికి వచ్చారన్నమాట." అంది.

విశ్వం నవ్వాడు.

"ఇప్పుడే వస్తానుండండి" అని వసంత లోపలికి వెళ్ళి కొంచెం సేపట్లో కాఫీ కప్పుతో తిరిగివచ్చి బల్ల మీద పెట్టింది.

"ఇప్పటికిదే ఇవ్వగలనండీ. క్షమించాలి"

విశ్వం మొహమాటపడ్డాడు. అప్పుడే బజార్లో తాగివస్తున్నానన్నాడు. ఆమె బలవంతం చేసింది. మరేమీ అనకుండా కాఫీ తాగేశాడు అతను

"మీరు చాలా మంచివారండీ. ఏదో అన్నానని అనుకోకుండా జ్ఞాపకం ఉంచుకుని వచ్చారు."

'మరి ఊరికే వచ్చేదాన్ని వదులుకోమంటారా?'

వసంత చిరునవ్వు నవ్వింది

"మీరు రిహార్సల్సుకి రావటం లేదేమండీ? రోజూ చూస్తున్నాను"

"నాకోసమా?"

"అవును"

"ఎందుకూ?"

వసంత తెల్లబోయింది. అతనలా అడుగుతాడని ఆమె అనుకోలేదు. ఒక క్షణం అతని ముఖంలోకి చూసి అంది

"కవిగారు కదూ? హావభావాలు ఎలా ఉండాలో సలహా ఇస్తారని"

తన అజ్ఞానంలో చిత్రమైన ప్రశ్నకి ఆమె ఇచ్చిన సమాధానం విశ్వానికి నచ్చింది

"నాకు నటనగురించి ఏమీ తెలియదు."

"తెలియకుండానే మెచ్చుకున్నారన్నమాట"

విశ్వానికి ఏమనటానికీ తోచలేదు. ఆలోచించి అన్నాడు

"మెచ్చుకోటానికి శాస్త్రం విషయాలు తెలియాలా?"

"మెచ్చుకోదలచుకుంటే చాలు."

సంభాషణలోని అమాయకత్వానికి విశ్వం ఆమెని మనసులోనే పొగిడాడు

"పోన్లెండి మీకేమీ రాదంటాను సరా?"

ఆమె సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వుకుంది.

"ఇంతకీ మీరు రిహార్సల్సుకి ఎందుకు రావటం లేదో చెప్పనే లేదు."

"నాకిష్టం లేదు"

"ఏం?"

"ఆ వాతావరణం నాకు నచ్చదు."

"వాళ్లు మీ నాటకం పాడుచేస్తుంటే చూస్తూ ఊరుకుంటారా?"

"పాడు చేస్తున్నారా?"

"ఆ డైరెక్టర్ నాకు నచ్చడు"

"అయినా సలహాలివ్వటానికి నాటకాల విషయంలో నాకు అనుభవమేమీ లేదు."

"ఆలోచన ఉంటే చాలు. వాళ్లు ఎంతసేపటికీ ప్రజల అభిరుచుల్ని గురించే మాట్లాడుతారు. అలా ఉంటేగాని ప్రేక్షకులు మెచ్చరు అంటారు. సహజ నటులకి అహంకారమెక్కువగా ఇతన్ని వాళ్లమీద ఫిర్యాదులుగా చెప్పటం లేదు నా మనసుకి తోచింది మీకు చెబుతున్నాను అది మీరు కవిగారు కనుక, రిహార్సల్స్‌కి రావటం లేదు కనుక చెబుతున్నాను"

"నా నాటకం పాడయితే మీకేం నష్టం?"

వసంత అతనివైపు ఆలోచనగా చూసింది

"అంటే మీకు అందులో ఉత్సాహమేం లేదా?"

"లేదు"

"అయినా నాటకం పాడయితే మీకు చెడ్డ పేరు వస్తుంది."

"నా కంతకుముందు మంచి పేరుంటేగా!" అన్నాడు విశ్వం నవ్వుతూ

"సామాన్యంగా అందరూ మీకు మరేమంటారు"

"మనుషుల రూపాలన్నీ ఒక్క తీరుగా ఉండనట్టే భావాలూనూ"

"నాటకం చెడిపోతే నాటక సంఘానికి పేరు ప్రతిష్ఠలేం ఉంటాయి?"

"పోనివ్వండి పాడుసంఘం"

"మీరుకూడా అందులో సభ్యులేకదూ?"

"సభ్యుడినే కావొచ్చు. కాని దాంట్లో నాకు అభిరుచిలేదు అదీకాక అందులోని వ్యక్తులంటే నాకు పరిపడదు వాళ్ళకి కావలసింది నాటకం కాదు తైతక్కలాడి ఏదో పేరు తెచ్చుకోటం. హడావిడి చెయ్యటం. అవాకులూ చెవాకులూ వాగటం కొత్తగా అందమైన నటి కనిపిస్తే ఆమెచుట్టూ తిరగటం. విరాళమిచ్చిందే పోటీకొచ్చినట్టు వాగటం. వాళ్ళకి నాటకాలూ, సభలూ ఎందుకు?"

వసంత అంతా విని విశ్వం ముఖంవైపు చూసింది. విసుగుదల, ఏహ్యభావం, కోపం అతని వదనంలో ప్రతిబింబిస్తున్నాయి.

"మీరు చెప్పింది నిజమే కాని వ్యక్తుల లోపాలు సంఘానికి వర్తింపచెయ్యగలరా?"

"వాళ్లు స్థాపించిందే ఆ సంఘం"

"పెద్దలైన వాళ్లు వెనకాల ఉన్నారుగా మీ లాంటి వాళ్లు కలగచేసుకొని బాగు చెయ్యటానికి ప్రయత్నించాలిగాని కోపగించుకుని పోదలిస్తే ఎలా?"

ఆమె మాటల్లో నిజం ఉందని ఒప్పుకున్నాడు విశ్వం

"ఈ సారి రిహార్సలుకు వస్తారా?"

"వీలయితే!" ఇంకా నవ్వుతూనే అన్నాడు.

"మీరు వస్తే నాకు ధైర్యంగా ఉంటుంది"

"ధైర్యమా! అంటే?" అన్నాడు అర్థం కాక.

"ఆ వెంకటేశ్వరరావూ, డైరెక్టరూ ఉన్నారే, వాళ్లి ప్రవర్తన నాకు నచ్చదండి."

కొంచెంసేపు మౌనంగా ఉండి అన్నాడు విశ్వం "పోనీ, నాటకంలో వెయ్యటం మానెయ్యరాదూ?"

"ఎలా?" అంది వసంత నిస్సహాయంగా

"బలవంతమేముంది. మీరేం డబ్బు తీసుకోటం లేదుగా"

"నిజమే కాని నా భవిష్యత్తు సంగతేమిటి?"

"ఈ నాటకంతోనే ఉందా మీ భవిష్యత్తంతా?"

"ఈ సంస్థకి పెద్దల సహకారం ఉంది ఈ నాటకంలో బాగా వేస్తే నటనే జీవనోపాధిగా చేసుకుందామని ఉంది అవకాశం కూడా దొరకవచ్చు నాకు పెద్దచదువులేదు ఇంట్లో తింటూ కూర్చోటానికి డబ్బు లేదు మరి ఇంక నేనేం చెయ్యగలను?"

"పెళ్లి చేసుకోండి" అన్నాడు విశ్వం హాస్యానికి అన్నట్టుగా వసంత మాటాడలేదు. వీరు పద్దకేమా నవ్వుకున్నాడు విశ్వం ఆ మాట కొంతవరకు వాస్తవమే కాని ఆ సమయంలో ఆమె ముఖంలో విసుగంటే ఏదో వేదన ప్రముఖంగా కంపించిందతనికి వసంత ఎంత సేపటికీ మాటామాట్లాడక పోవటం అతనికి అసు

ప్రారంభం కాబోతుందని మైక్‌లో ప్రకటించారు. ఆడిటోరియంలో లైటు ఆరిపోయాయి తెర తొలగింది.

దృశ్యం ఒక పల్లెటూరులో పచ్చ పొలాల మధ్య ఒక ప్రదేశం సెట్ వేశారు రంగస్థలం ఏర్పాటు చేయబడ్డది—సెట్‌లో ఒక భాగంగా కొబ్బరిఆకులతో తోరణాలు కట్టగా రెండు పెట్రోమాక్సులైట్లు కర్రలకి కట్టబడి వెలుగుతున్నాయి రంగస్థలంలోని రంగ స్థలంమీదకి ఓ మాసికగుడ్డలు ధరించిన వ్యక్తి వచ్చి "అయ్యా, ఇప్పుడు 'దశావతారాలు' భరతనాట్య ప్రదర్శన జరుగుతుంది తమ రంతా దయచేసి నిశ్శబ్దంగా ఉండాలని కోరుతున్నాను" అని పక్కకి వెళ్ళి పోయాడు. రంగస్థలంమీద తబలా, హార్మోనియం, వయొలిన్ వాయిద్యాలని వాటి తాలూకు వాద్యగాళ్ళు సరిచూసుకొని శ్రుతి కలుపుకుంటున్నారు. ఇంతలో గజ్జెల రవళి వినిపించింది నేపథ్యంలో. వాద్యసంగీతం ప్రారంభమైంది' ఒక ఎలజవ్వని రంగంమీదకి వచ్చి అందరికీ నమస్కరించి ప్రార్థన చేసింది.

గజ్జెలు ఘల్లు ఘల్లు మన్నాయి తబలా లయకలిపింది తధిత్తోం తదిగి తత్తోం భరతనాట్యం ప్రారంభమైంది

నేపథ్యంలో శ్రావ్యమైన కంఠం వినిపిస్తోంది ..

మత్స్యరమున మరియంబుధిలో జొచ్చియున్న
సోమకు గ్రుంచియు
విద్యలనిడి వేదములజావకు నిచ్చితివో మత్స్యవత
తారా! ఇచ్చితివో మత్స్యవతారా!"

ముద్ర పట్టింది నర్తకి

చప్పట్లు చరిచారు ప్రశంసా పూర్వకంగా నేపథ్యంలో ప్రేక్షకులు...

మలయుచు నిను ప్రస్తుతి చేయగ చెలగి సురలు
జలధి మధింపగ
కలిమి బలిమి రొలమితో జొనగిన కు-గిరిపర
కూర్మావతారా!"

కూర్మావతార ముద్రపట్టుకొంది నర్తకి.

నేపథ్యంలో ఆ ధ్వనిస్వరం దర్పంగా వినిపించింది.

రెడ్డొచ్చె మొదలాడు.

రెడ్డొచ్చె రెడ్డొచ్చె మొదలాడు.

ఓ అజానుబాహువిగ్రహం రంగస్థలం మీదకి వచ్చి ఠీవిగా నుంచుంది బొమ్మ వేసిన చేతికర్ర ఊగిస్తూ.

ఆగిపోయింది నర్తకి. ఆగిపోయాయి వాద్య గాళ్ళు. ఆగిపోయింది గానం. మరికొంచెం సేపటికి మళ్ళీ గజ్జెలు ఘల్లుమన్నాయి—తకధిం తక తా కిట తక .

" విద్యలనిడి వేదము లజావకు
ఇచ్చితివో మత్స్యవతారా!
నీ విచ్చితివో మత్స్యవతారా!"

మత్స్యవతార ముద్ర పట్టింది నర్తకి

చప్పట్లు మళ్ళీ వినిపించాయి ఆ చప్పట్ల చప్పుడు లోంచి గంభీర స్వరం వినిపించింది

పంతులొచ్చె మొదలాడు
పంతులొచ్చె మొదలాడు

మరొక వ్యక్తి రంగ స్థలంమీది కొచ్చి రెడ్డి ప్రక్కన నుంచున్నాడు దర్జాగా. రెడ్డి ముఖం చిట్లించాడు.

భరత నాట్యం మళ్ళీ మొదటి కొచ్చింది .

"మత్స్యరమున మరియంబుధిలో "

నేపథ్యంలోంచి ఓ స్వరం అధికారపూర్వకంగా హెచ్చరించింది.

చౌదరొచ్చె మొదలాడు
చౌదరొచ్చె మొదలాడు

నర్తకి నిస్సహాయంగా చూసింది. పట్టబోయే ముద్ర ఆగిపోయింది.

ఠీవిగా రంగంమీద కొచ్చాడు ఒక వ్యక్తి. పాట మొదటి కొచ్చింది గజ్జెలులయ వేయసాగాయి.

" విద్యలనిడి వేదములజావకు. ఇచ్చితివో మత్స్యవతారా! నీ విచ్చితివో మత్స్యవతారా!" నేపథ్యంలోంచి ఖంగున మోగింది ఓ గొంతు.

నాయుడొచ్చె మొదలాడు
నాయుడొచ్చె మొదలాడు.

రంగం మీదకి వచ్చి నలువైపులా చూసి మీసాలు మెలేసి నుంచున్నాడు మరో వ్యక్తి.

తిరిగి ప్రారంభమైంది భరతనాట్య కార్యక్రమం నర్తకి మత్స్యవతార ముద్రపట్టి పరవశంతో అలాగే నిలబడి పోయింది. ఇంతలో నేపథ్యంలో ఎవరో అరిచారు. నర్తకి తెప్పరిల్లింది.

"శ్రేష్ఠి వచ్చె మొదలాడు
శ్రేష్ఠి వచ్చె మొదలాడు

అందరికీ ఆశ్చర్యంతోపాటు ఆగ్రహం కలిగించింది. ఎవరైనా ఈ ప్రసక్తి అతనిముందు తెస్తే అదేదో ఘనకార్యం కాదన్నట్టు మాట్లాడతాడు.

ఇలాంటివే కొన్ని చెప్పుకోదగ్గ పనులు చెయ్యటంవల్ల అతనంటే ఊరివాళ్ళకి అభిమానం ఏర్పడ్డది. చిత్రమేమంటే ఇలా ఊళ్ళో తనని అభిమానిస్తున్నారనే విషయం అతని ఆలోచనలోకి రాదు. ఆ విషయం అతనికి తెలియదనికాదు. ఒక విధమైన విరక్తత అతని ముఖంలో ద్యోతకమవుతుంది. ఓసారి సభావేశంలో మూర్తిని పొగిడి ఈ మనిషి ఎవరో ప్రశంసా వాక్యాలు పలికితే, వెంటనే లేచి అన్నాడు.

"నేనూ ఊరివాళ్ళలో ఒకణ్ణి. ఒకవేళ నేనేదైనా చేస్తే అందులో నేనాశ్చర్యకరమేం లేదు. నాకు అవసరమనిపించిన పనులే నేను చేశాను. ఇందులో ప్రశంసించటానికేం లేదు."

మరో వ్యక్తి ఈ మాటలంటే మర్యాదకోసం, వినయంకోసం అన్నాడని సులభంగా ఊహించే వాళ్ళు జనం. కాని ఆ మాటలు అన్నవాడు మూర్తి. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ మెప్పుని సూచించే మాట ఒక్కటి పలికినా ముఖం చిట్లించుకుని చిరాకుపడే ఒకే వ్యక్తి. పొద్దస్తమానమూ పని వాళ్ళతోపాటు వొళ్ళు వొంచి చాకిరిచేసే ఆసామీ. అజమాయిషీ పేరుతో గట్టుమీద చేతులు ఆనించి దిక్కులు చూస్తూ నిలబడే కర్ర పెత్తనదారు కాదు మూర్తి.

పడమటి ఆకాశం ఎర్రబారుతోంది. ఆ సమయంలో ఓ వ్యక్తి మూర్తిదగ్గిరికి వచ్చి 'నమస్తే' అన్నాడు. దగ్గర్లో ఉన్న చిరిచాపలాగి "కూర్చోండి" అన్నాడు. మూర్తి, ఆ వ్యక్తిని ఆపాదమస్తకం చూసి

"నేను కరణంగారి దగ్గిర్నుంచి వస్తున్నానండీ" కూర్చుంటూ అన్నాడతను.

"అలాగా!"

"నా పేరు వెంకటపతి. ఈ సంవత్సరం నేను బి. ఏ. ప్యాసయ్యాను. మూర్తిగారు మీరేనా?"

"అవునండీ" అంటూ మూర్తి దగ్గర్లో ఉన్న కుండలోని నీళ్ళు పంచపాత్రలో పోసి వెంకటపతికిచ్చాడు. ఆ చల్లటి మంచితీర్థం తాగాక అతను తను వచ్చినపని చెప్పాడు.

"కాలేజీలో చదువుతున్నప్పుడు నేను సంఘసేవ చేసేవాడినండీ. కాలేజీ సాంఘిక సేవాసమితి సభ్యుణ్ణి. మొన్న ఆమ్యాన ఈ ఊరి మట్టిరోడ్డుమీద కంకర వేసిన బృందంలో నేనుకూడా ఉన్నాను. ఈ ఊళ్ళో నాకు చేతనైనంతవరకు కొన్నాళ్ళు సంఘసేవ చెయ్యాలని ఉందండీ"

"మంచిది" అన్నాడు మూర్తి

"ఏం చేస్తే బావుంటుందంటారు?"

"నాకా విషయాలు తెలియవే"

"మీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తాయి?"

"అదేమి టలా అంటారు?"

"కరణంగారు మీ విషయమంతా చెప్పారు. మీ సలహా తీసుకుని ఏదైనా చేస్తే బావుంటుందని ఆయన చెప్పిన మీదటే మీ దగ్గిరకొచ్చాను. మీరు సహాయపడతారని ఆశపడుతున్నాను"

"నావల్ల సహాయం జరిగే వీలుంటే సంతోషంగా చేస్తాను. కాని నేనేం చెయ్యగలనో నాకే తెలియదు. మీ కార్యక్రమ మేమిటో చెప్పండి"

"అది తయారు చెయ్యటానికే మీ సలహా అడుగుతున్నాను"

మూర్తి ఆలోచించాడు. ఆ క్షణంలో అవసరాన్నిబట్టి తోచిందేదో చెయ్యటమే గాని తనింత వరకూ ఫలానా ఫలానా వ్యవహారాలు ఫలానా విధంగా చెయ్యాలని ఆలోచించి ఆ కార్యక్రమం ప్రకారం నడవటం ఎరగడు

"మీరీ ఊళ్ళోనే స్థిరపడిపోతారా?"

"ఎబ్బె, లేదండి."

"ఎన్నాళ్ళుంటారు?"

"బి. ఏ. ప్యాసయ్యాను కదండీ. ఏదైనా ఉద్యోగం వస్తే వెళ్ళిపోతాను. ఈ లోపల ఏ కొంత వరకూ నలుగురికీ పనికొచ్చే పనేదైనా చెయ్యాలని ఉబలాటం."

మూర్తి పొడిగా నవ్వాడు

"చెయ్యవచ్చు. దానికేం. కాని అర్థాంతరంగా వెళ్ళిపోతే ఏంలాభం?"

"ఎవరికి?" అన్నాడు వెంకటపతి.

"ఊరికీ, మీకూ కూడా."

"జరిగినంత పనే జరుగుతుంది."

అని పద్మ లోపలికి వెళ్ళిపోయింది. విశ్వం చిరునవ్వు నవ్వుకున్నాడు ఎంతగా మారిపోయింది పద్మ! పూర్వం ఎరుపురంగంటే ఆమెకి అసహ్యం. ఇప్పుడు ఎరుపురంగు చీరలే కట్టుకుంటుంది. ఇదివరకు అంత స్వేచ్ఛగా ఇంట్లో తిరిగేది. ఇప్పుడేమో ప్రతి దానికీ తడుముకుంటున్నట్టుగా ఉంటుంది. తనేమిటో చుట్టపుచూపుగా వచ్చినట్టు మాట్లాడుతుంది. ప్రతి విషయంలో డాక్టర్ ఇష్టా ఇష్టాలు సూచిస్తుంది. ఇంతగా ఆమె తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోటం విశ్వానికి కొంచెం కష్టంగా ఉంది. ఈ మార్పులన్నీ ఎంతవరకు పద్మ తెచ్చిపెట్టుకున్నవో, ఎంతవరకు డాక్టర్ గారి ప్రభావం ఫలితాలో తనకి తెలియదు. కాని ఇలా మారటం అంత సమంజసం కాదని తోస్తోంది తనకి. పద్మ నడిగితే ఈ విషయాలు చాలా తేలిగ్గా తోసేసుంది తనేం మారలేదనీ, ఒకవేళ మారినా ఆ విషయం విశ్వం చెప్పేదాకా తనకి తెలియదనీ అంటుంది.

కాలహరణం అయిపోయింది. పద్మ ప్రయాణం కట్టింది. విశ్వం తీసుకొని వెళుతున్నాడు వెళ్ళబోతూ గోపికి పది రూపాయల నోటిచ్చింది పద్మ

"వాడికి డబ్బివ్వటమేమిటి?" అన్నారందరూ. కాని వాడు వెంటనే ఆ నోటు నిక్కరు జేబులో దాచుకున్నాడు అప్పుడప్పుడు అక్కయ్య తనకిచ్చిన ప్రజెంటు చూసుకుంటుంటే అదో తృప్తిగా ఉంటుందని వాడికి ఆ సమయంలో అనిపించింది.

"స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు" అన్నాడు విశ్వం

"అబ్బ మళ్ళీ మొదలు అన్నయ్యా. మళ్ళీ ప్రతి దానికీ వాదిస్తావు" అంది పద్మ.

విశ్వం మళ్ళీ నోరెత్తలేదు. తను వాదిస్తాడట! గంటలతరబడి తనతో పేచీ పెట్టుకుని ఉక్రోషం తెప్పించే పద్మేనా యీ మాటలు అన్నది!

హైదరాబాదులో డాక్టరుగారి ఇల్లు, ఆస్పత్రి కూడా నగరంలో ఒకచోట ఉన్నాయి. ప్రయాణపు బడలికతో కుర్చీలో కూలబడి "ఏమిటయ్యా, బిక్కచచ్చి కూర్చున్నట్టు ఇక్కడ పెట్టావు మకాం?" అని రిమార్కు చేశాడు విశ్వం. శ్రీనివాసరావు నవ్వి ఊరుకున్నాడు.

ఆ సాయంత్రం శ్రీనివాసరావు తన డిస్పెన్సరీ చూపించాడు విశ్వానికి. నర్సింగ్ హోమ్ వేరేచోట ఉంది. ఇల్లూ, డిస్పెన్సరీ, నర్సింగ్ హోమ్ అన్నీ కలిపి ఒకచోట పెట్టుకుని సలహా ఇచ్చాడు విశ్వం.

"అలా అయితే చిక్కులున్నాయి" అన్నాడు డాక్టర్

"ఏమిటా చిక్కులు?"

"పొద్దస్తమానూ యీ రోగులగోడుతో నేను సతమతమవుతుంటే కాక పద్మకి కూడా ఆ అవస్థ దేనికి?"

విశ్వం అనాలనుకున్నది తప్పించి అన్నాడు.

"రోగుల గోడని విసుక్కునేవాడివి మరేం డాక్టరయ్యావు?"

"ఈ, ఎన్ టి స్పెషలిస్ట్‌ని" డాక్టర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"అసలు ప్రశ్న తప్పించవు రోగులకు సేవచేసే అవకాశం లభించినందుకు సంతోషంతో ఆ పని చేయాలిగాని విసుక్కోటం డాక్టరైనవాడికి ధర్మం కాదు. అంతో ఇంతో సంఘసేవ చెయ్యాలనే అభిలాష ఉన్న నాలాంటివాడికి ఆ అవకాశమే దొరకదు. దొరికిన నీలాంటివాళ్లు అసంతృప్తితో బాధ పడతారు. మనుషుల చిత్తప్రవృత్తుల్ని బట్టి ఉద్యోగాలు దొరికితే ఎంత బావుంటుంది!"

డాక్టరేమీ సమాధానం ఇవ్వలేదు. చిరునవ్వు నవ్వుతూ విశ్వంవైపు చూడసాగాడు. డాక్టర్ సమాధానం చెప్పకపోవటంతో విశ్వానికి మరింత అవకాశం లభించింది తన వాగ్ధోరణి కొనసాగించటానికి.

"ఒక్క ప్రశ్న అడుగుతాను చెబుతావా? తడుముకోకుండా సమాధానం చెప్పాలి"

"అడుగు."

డాక్టర్ కళ్ళలోకి గంభీరంగా చూస్తూ బాణంలా వొదిలాడు తన ప్రశ్న విశ్వం.

"నీ జీవితలక్ష్యం ఏమిటి?"

"గొప్ప డాక్టర్ని కావటమే"

గోల్‌లోకి బంతిని తన్నినట్టు విజయసూచకంగా చూశాడు డాక్టర్. వెంటనే వచ్చిన ఈ సమాధానానికి ఓడిపోయిన గోల్ కీపర్ లా ముఖం పెట్టాడు విశ్వం.

"ఇంకొక ప్రశ్న. ఈ పాతికేళ్ళలో నువ్వు చేసిన ఒక్క మంచిపని చెప్పు, చూద్దాం."

డాక్టర్ ఆలోచించసాగాడు. విశ్వం విజయసూచకంగా ముఖం పెట్టాడు.

"చెప్పలేను. చూశావా, నీ ఇరవై అయిదేళ్ళ జీవితం స్వార్థంతో నిండివుందన్నమాట. అందుకని, డాక్టరుగారూ, ఈ విషయం మనసులో ఉంచుకుని మీరు రోగులతో మెలగండి."

డాక్టర్ విశ్వం బుజంమీద చెయ్యేసి నవ్వుతూ "నువ్వు సంఘసేవకుడివని, సంఘోద్ధారకుడివని నాకింతవరకూ తెలీదు. ఒక్కసారైనా చెప్పావు కాదేం?" అన్నాడు.

ఆ మాటలు వినగానే విశ్వం ముఖం ముకుళించింది. తను చేసిన సంఘసేవ ఏమిటి? ఇప్పటివరకూ ధ్యేయం 'సంవత్సరం పొడుగునా సంఘసేవ చేస్తావురో' అని ఉగాదినాడు మూర్తి అన్న మాటలు గేలి చేస్తున్నట్టనిపించింది విశ్వానికి.

విశ్వం హైదరాబాద్ వచ్చి మూడు నాలుగు రోజులైంది. తోచనప్పుడు డిస్పెన్సరీలో, నర్సింగ్ హోమ్‌లో వచ్చి రోగుల్ని పరామర్శించి వస్తుండేవాడు. ఒకరోజు సాయంత్రం డిస్పెన్సరీనించి బజారుగా అడుగులు వేసుకుంటూ ఇంటికి వచ్చాడు. అతనదోలాగ ఉండటంచూసి పద్మ కారణం అడిగింది. ఏం లేదన్నాడు. ఏదో ఆలోచిస్తూ వాలుకుర్చీలో పడుకున్నాడు.

డాక్టరు మామూలుగా రాత్రిపూట ఎనిమిది లోగానే ఇంటికి వస్తాడు. ఆ రోజు రాత్రి ఎనిమిది దాటినా ఇంకా రాలేదు.

"నువ్వు భోజనానికి లే అన్నయ్యా. నీకు ఆలస్యమవుతోంది. వారు తరవాత భోజనంచేస్తారు." అంది ఆమె.

"ఆకలి లేదులే" అన్నాడతను.

తొమ్మిది దాటింది.

"డాక్టర్ అప్పుడప్పుడు ఇంటికి ఆలస్యంగా వొస్తారా?"

"అవును. ఒక్కొక్కసారి పన్నెండుకూడా అవుతుంది."

"అప్పటివరకూ ఎక్కడుంటాడు."

"కాన్పు ప్రమాదపు కేసులుంటే అలాగే అక్కడే ఉండిపోతారు."

"ఎవరు చెప్పారా సంగతి?"

"వారే"

"నిజమో కాదో కాంపౌండర్ని అడిగావా?"

పద్మముఖం ఎర్రబారింది.

"నాకెందుకా కర్మం?" అంది.

"ధర్మపత్నివి కదూ!" అన్నాడతను.

"ఏమిటి నువ్వు మాట్లాడేది?"

"డాక్టర్ గారికి గడ్డిపువ్వుమీద మోజెక్కిందిలే."

"అంటే?"

"నువ్వంటే శ్రీనివాసరావుకి నిజంగా ఇష్టమేనా?"

పద్మ కొంచెం విసుగా తలతిప్పింది.

"పద్మా, డాక్టర్ నువ్వనుకున్నంత మంచివాడు కాడు."

"చాల్లే. మళ్ళీ అనకు అలాంటిమాట" అంది పద్మ కోపంగా.

"డిస్పెన్సరీలో అందరూ అనుకుంటూంటే ఆయనకి నర్సుతో సంబంధముందని అందుకే ఆలస్యంగా రావటం."

"ఛీ" అంది పద్మ అసహ్యించుకుంటూ. "వాగకు అన్నా. అలాంటివి నువ్వెలానమ్మావు?"

"పుకారయితే మంచిదేకాని దురదృష్టవశాత్తూ అది పుకారు కాదని నా నమ్మకం. ఆయన నర్సుతో కిలకిలనవ్వటం నేను చూశాను."

"ఆయన అందరితో అలా మనస్ఫూర్తిగా నవ్వుతూ మాట్లాడతారు. తాడూ బొంగరం లేని మాటలు నాకు చెప్పకు. నేను నమ్మను ముమ్మాటికీ నమ్మను. నమ్మలేను."

ఆవేశంగా అంది పద్మ. కంట కన్నీరొలికింది. ఆమెవైపు జాలిగా చూశాడు విశ్వం.

"నువ్వు దొరకటం డాక్టర్ అదృష్టం. అందంలో గాని, గుణంలో గాని, తెలివిలో గాని డాక్టర్ నీకు తీసికట్టు పద్మా. డాక్టర్ నీకు తగడని నాకు తెలుసు, నీకు తెలుసు, అందరికీ."

పద్మముఖం జేవురించింది. ఆమె విశ్వం నోరు మూసింది.

"నీకేమీ తెలీయదు. మనిషంటే మనసూ, మాటా హృదయమూ. అంతేకాంటే నాకేమీ మనిషి విషయం తెలీయదు. వారికంటే అందమైనవారు ఎవరూ లేరు."

ఈ మాటలు మెల్లిగా అతి సహజంగా ఏదో సత్యాన్ని చాటే విశ్వాసంతో అంది పద్మ.

విశ్వం మరేమీ మాట్లాడలేదు. ఇటువంటి పద్మని తనెరగడు. పద్మ అనే వ్యక్తి తనకి కనిపించటం

లేదు. ఏదో మూర్తి తేజస్సు విరజిమ్ముతూ సత్యం, శివం, సుందరం నిర్వచిస్తున్నట్టు అనుభూతి పొందాడు విశ్వం.

బయట ఉరుములు మెరుపులతో జోరుగా వర్షం కురుస్తోంది. రాత్రి పన్నెండు దాటింది పద్మ, విశ్వం అలాగే తమ స్థానాల్లో ఉన్నారు తలుపు చప్పుడయింది పరిగెత్తికెళ్లి పద్మ తలుపుతీసింది ఎదురుగా తడిసి ముద్దయి డాక్టరు నుంచున్నాడు

"అబ్బ ఆకస్మికంగా దారిలో కొట్టింది వాన మైలుదూరం నడవాల్సొచ్చింది సైకిల్ ట్యూబ్ పంచర్ పడ్డది" అంటూ లో పలికొచ్చి విశ్వాన్ని చూశాడు

"అరె, ఏమిటోయ్, ఇంకా అలాగే నిద్ర పోకుండా కూర్చున్నావేం?"

"నిద్రొస్తేగా" అన్నాడు విశ్వం

"శ్రేయ గొప్పదనం డాక్టర్ కోసం కనిపెట్టుకుని కూర్చుంటే బాగుండదేట్టి"

విశ్వం నవ్వు తెచ్చుకొన్నాడు. డాక్టర్ బట్టలు మార్చి పొడిబట్టలు వేసుకున్నాడు ఆ తరువాత హుషారుగా ఏవో మాట్లాడుతున్నా విశ్వం మాత్రం ముభావంగానే ఉన్నాడు

"మృత్యువుతో పోట్లాట అనుకో ఏమవుతుందో పాపం భయం లేదనుకుంటాను" తనలో అనుకున్నట్టుగా గొణిగాడు డాక్టర్.

"ఎవరి సంగతి?"

"ఎవరో కూలివాడు, పాపం మందు కొనటానికి కూడా లేనివాడు. వాడిమీద కుటుంబం అంతా ఆధారపడి ఉంది చిన్నపిల్లలు"

విశ్వం కొంచెం అపనమ్మకంగా చూశాడు డాక్టర్ వైపు "చూశావా!" అన్నట్టు పద్మ ధీమాగా విశ్వంవైపు చూసింది.

తెలవారింది. రాత్రి వానలో తడవటంవల్ల డాక్టర్‌కి కొంత తగిలింది అయినా పరకు చెయ్యక డిస్పెన్సరీకి బయలుదేరబోతున్నాడు ఇంతలో ఎవరో ఒక పేద స్త్రీ వచ్చి, డాక్టర్ కాళ్లకి నమస్కారం చేసి భర్తాజా కృతజ్ఞతలు చెప్పటం మొదలుపెట్టింది దేవుడల్లే అడ్డుపడి తన భర్త ప్రాణం దక్కించినందుకు డాక్టర్ని ఆమె అనేకంగా దీవించసాగింది మరొక డాక్టరయితే అలాంటి దగ్గర పడిగాపులుపడి ఉండి ప్రాణం దక్కించటానికి శ్రమపడేవాడు, ఆ తరువ యీణం ఈ జన్మకి తీర్చుకోలేని రుణంచింది. "అంతా అదృష్టం" అని డాక్టర్ ఆమెని పంపించివేశాడు

విశ్వం పద్మవంక చూశాడు ఆమె చిరునవ్వు నవ్వుతోంది అతనుకూడా నవ్వాడు "ఏమిటి కథ?" అన్నాడు డాక్టర్ అది చూసి "తరవాత చెబుతాలే" అన్నాడు విశ్వం

కొద్దిలో పోతుందనుకున్న జ్వరం కుదరంగా పోదల్లోగు డాక్టర్‌కి ఇన్ఫెక్షన్లోకి దింపింది పద్మ రాత్రింబవళ్లు సేవ చేసింది. విశ్వం కూడా మంచం దగ్గిర ఉండి కబుర్లు చెబుతున్నాడు

ఆ సాయంత్రం ఏవో మందులు కొని తీసుకురావటానికి విశ్వం బయల్దేరాడు బజారుకి వెళ్ళటానికి డిస్పెన్సరీ మీదగా వెళ్లాలి డిస్పెన్సరీ ఉన్న వీధంతా ఎక్కువగా కూలి నాలి చేసుకుని బ్రతికే జనం నివసించే ప్రదేశం విశ్వం నడుస్తుంటే చప్పుడు చప్పట్లు వినిపించాయి జనం గోలామంది గుమిగూడారు అదేమిటో చూద్దామని అక్కడికి వెళ్లాడతను అమ్మవారికి జాతర జరుగుతోంది

"ఏమిటి ఊళ్లో బాగుండలేదా?" అడిగాడు విశ్వం గుంపులో ఒకణ్ణి

"కాదు బాబూ, డాక్టర్ బాబుగారికి ఒంట్లో సరిలేకుండంది జాతర చేస్తే తగ్గుతాదని మా వోళ్లంతా చేస్తున్నాం"

విశ్వం ఆశ్చర్యపోయాడు

"ఏ డాక్టర్? శ్రీనివాసరావుగారేనా?"

"చిత్తం దొరగారూ మా లేనోళ్ళకి దిక్కు పాపంపోని దొర ఆయన తలికకునుపు దల్లగా నూరేళ్లు బతకుండాలి"

గుంపులో కలిసిపోయాడతను విశ్వం కళ్లు చెమ్మగిల్లాయి. ఒక్క మంచిపని చెయ్యమని డాక్టర్‌కి తను సలహా ఇచ్చాడు!

విశ్వం ఇంటికి వచ్చేసరికి చీకటి పడింది అప్పటికే పద్మ భర్తకి మిటాయిలు చూస్తూ "అన్నయ్యా," అంది. డాక్టర్ ఆమె వైపు చిరునవ్వుతో ప్రేమగా చూశాడు.

ఆ సమయంలోనే విశ్వం గదిలో అడుగుపెట్టాడు ఆశ్చర్యంతో మరిచిపోయాడు "నిన్ను ఏదో మంచిపని చెయ్యమని సలహా ఇచ్చాను అది ఉపసంహరించుకుంటున్నాను డాక్టర్" అన్నాడు విశ్వం

డాక్టర్ ముసిముసిగా నవ్వాడు.

పద్మకిదేమీ అర్థం కాక విశ్వం వైపు అయోమయంగా చూసింది.

కమల: మిమ్మల్ని దక్కించుకున్నాను. నాకదే పది వేలు

రామం: నీ ప్రపంచంలో నెగ్గినందుకూ, నన్నోడించి నందుకూ నీకెంత ఆనందం

కమల మీ మంచిని కోరుకోడం తప్పా!

రామం దక్కించుకున్నావు! దక్కించుకో, ఎగురుగా పెట్టుకున్నావుగా ప్రతిక్షణం నీ ఎక్కువ తనాన్ని నా తక్కువతనాన్ని ఋజువు చెయ్యడంకోసం—అదీ పద్దతిలెండి .

కమల (ఏడుస్తూ) మీరన్నీ తెల్సినవారు మీపట్ల నాకెంత గౌరవమో, విశ్వాసమో, మీరెరుగుదురు అన్నీ తెల్సి మీరిలా

రామం పోనీ అయిందేదో అయిపోయింది నిరా రించకు ఇప్పపెన్నా మించి పోయింది లేదు నీ అందం, గుణం, తెలివి నీకున్నాయి ఏమీ తరగలేదు రామం అనేవాడు లేడుకదా (తనని చూపుకొని) ఈ శరీరానికి అభ్యంతరం లేదు ఈ చేతులెత్తి ఆశీర్వదిస్తుంది.

కమల దేనికి?

రామం: అదే పరిపూర్ణత పొందాలంటే రామం అనేవాడి ఆత్మకూడా సంతోషిస్తుంది

కమల: (అలిగా) మీరిలా సంతోషంగా ఉండేందుకు ఏం చెయ్యమన్నా చేస్తాను

రామం చేస్తావు కద

కమల: ఆఁ.

రామం ఆడితప్పవుకద!

కమల ప్రామిస్ ఇస్తాను .

రామం అది కాదు-ఇది అందరికీ తృప్తి, సంతోష మూ నరా .

కమల చెప్పండి

రామం అందం, గుణం, తెలివి, దీనికితోడు డబ్బున్న ఒకమంచి కుర్రాడ్ని చూసి అతడితో కాపురం పెట్టేయి

కమల: (దెబ్బతిన్నట్లయి, పిచ్చిదానిలా చూస్తూ ఉండి పోతుంది)

రామం ఏమీ కష్టం లేదు నన్ను చూడమన్నావా! చూసి పెట్టనా ఓ అబ్బాయిని!

కమల (మాటాడలేకపోయి, మాటాడ లేదు)

రామం కోటికి పడగెత్తిన వాడుకూడా నీ అడుగులకి మడుగులొత్తుతాడు. అప్పుడు నీకు పరిపూర్ణత.. అందరం సంతోషిస్తాం (తనని చూపుకొని) ఈ చెవాముల ప్రాణంకూడా సంతోషిస్తాడు ఊఁ ఆనవూ? అప్పుడు నీ అదృష్టం పువ్వులా కాయలా తొడిగి నీ కళ్ళలో మెరుపులు మెరిసి నీ పెదవులలో హాసం తొణికి నీ ముఖాన హాసం వెలసి .

కమల (తెలివితప్పి క్రిందకు జారిపోతుంది)

రామం (వికటవ్వు నవ్వి) ఎందుకులే ఆ నటన ఇష్టం లేదూ? సిగ్గుగా? ఆడువారు ఎంతయినా ఏదో అనందరూ ఈ బాధ, ఈ నరకం, ఎగురుగా ఎప్పుడూ నా ఈ ఆకారం పోతుందాయి (వికృతంగా నవ్వి నవ్వి కాలితో ఆమెను కదిపి) లే లేవూ అంత సిగ్గా! (కసిగా ముఖం పెట్టి కాలితో గట్టిగా తోస్తాడు ఆమె కదలదు. కాలితో తంతాడు.. ఆమె కదలకపోగా అతనిముఖం పాలిపోతుంది. గట్టిగా) అమ్మా! అమ్మా!

తల్లి (వెనుకనుండి) ఏం బాబూ వస్తున్నా . (వచ్చి కమలను చూసి) ఇదేమిటి? ఏమయింది నా తల్లి కేమయింది ఏమయిందే కమలమ్మ తల్లీ!

రామం అబ్బ గోల పెట్టకు నీడి చేసి ముఖం తిరిగింది కాబోలు కాస్త నీళ్ళు జల్లు

పైనుండి స్త్రీ, పురుష కంఠాలు, తలుపు కొడుతూ రామం! రామం!

రామం నీళ్ళా తయారయిపోయేను . వాళ్ళని తీసి లేయి పొమ్మను

[కుర్చీలోనుండి లేచి మందంవేపు నడవబోయి, బలం చాలక తూగిపడిపోతాడు ]

తల్లి అయ్యో దేవుడా! బాబూ రక్షించండి .

## రంగం: 3

* * రెండో రంగంలోలానే. రామారావ్ రాసుకుంటూ ఉంటాడు. తల్లి వస్తుంది.

తల్లి: రాసుకుంటున్నావా బాబూ!

రామం అ ఏదో ఊరు పోయేందుకు ఇంక లేవ ట్నించి ఆఫీసూ గొడవా ఎలాగూ ఉంది...

## ఆత్మహత్య

రాము: అసూయ ఉంది..
సరోజ: (కోపంగా) ఎవరికి?
రాము: నీకు
సరోజ: అసూయా? నాకెందుకసూయ?
రాము: నువ్వు కాలేక పోయావే అని
సరోజ: అంటే అంటే
రాము: (నవ్వి, మాటలు నొక్కుతూ) అంటే నువ్వు నన్ను ఇంకా ప్రేమిస్తూనే ఉన్నావని నా విశ్వాసం
[సగర్వంగా కమలకేసి చూస్తాడు]
సరోజ: (దెబ్బతిన్నట్టయి) నిన్నా నిన్నా
రాము: నిన్నే నిన్నే
సరోజ: (ఆవేశంతో) బ్రూట్!
[రాము కమీజు పట్టుకు లాగి చెంపమీద కొడుతుంది]

రాము: (ఆశ్చర్యపోయి, తేరుకుని నవ్వుతూ) దాలు... ఆ నిదర్శనం చాలు నిన్ను నువ్వే బయట పెట్టుకున్నావ్ ..(కమల చెయ్యి పట్టుకుని) కమలా నీకెలా కృతజ్ఞత చెప్పుకోను! ఎలా
కమల: (విరసంగా) దేనికి? దేనికి కృతజ్ఞత? (హిస్టీరికల్ గా నవ్వి కుప్పగా కూలబడుతుంది)
తల్లిగొంతు దగ్గరౌతూ: — కమలా పిన్నిగారు పిలుస్తున్నారు (తల్లి వచ్చి చూసి)
అయ్యో కమలమ్మా
ఏమయిందమ్మా నీకు
(కమల పక్కనే కూలబడి ఆమె తల ఒడిలోకి తీసుకుంటుంది)
రాము: (వెర్రిగా) కృతజ్ఞత కృతజ్ఞతయింది
సరోజ: (భయంతో వణికి పోతూ కుర్చీలో కూలబడుతుంది. [తెర]

సశేషము

# సముద్రపుమొక్కలు: వాని ఉపయోగములు

డాక్టర్ ఆర్. ఎల్ ఎన్. శాస్త్రి

నేలపై నుండు మొక్కలవలెనే సముద్రములో నుండు అనేక రకముల వృక్షజాతులు మనకు చాల ఉపయోగకరములను సంగతి సామాన్యులకంతగ తెలియదు. మానవుని ఆహారమునకు అత్యవసరమైన పదార్థాలను సముద్రపు మొక్కలు తయారుచేయగలవు. ఇట్టి పదార్థములు ఇతరత్ర సులభముగా లభ్యము గాజాలవు. కాడ్‌లివర్ ఆయిల్ ఆరోగ్యము నిచ్చునన్న విషయము అందరికీ తెలిసిందే. కాని దాని శక్తి సముద్రపు మొక్కలనుండి వచ్చుచున్న సంగతి అందరికీ తెలియదు. కాడ్ అను చేపయొక్క లివర్‌లో కొన్ని విటమినులు, అయొడిన్‌ను నిల్వచేయుశక్తి కలదు. కాని అది ఈ పదార్థములను సరాసరి సముద్రములో నుండి పొందుటలేదు. అది కొన్ని చిన్న చిన్న సముద్రపు జంతువులను తినును. ఈ చిన్న జంతువులు సముద్రపు మొక్కలను తిని బ్రతుకుచున్నవి. సముద్రపు మొక్కలలో అయొడిన్, విటమినులు విరివిగా నుండును. సముద్రపు నీటిలో చాల అయొడిన్ ఉండును. దీనిని సముద్రపు మొక్కలు సేకరించి దానిని చిన్న జంతువుల ద్వారా మానవునికి అందజేయుచున్నవి. జపాను దేశీయులు సముద్రపు మొక్కలను ఆహారముగా నుపయోగించుటలో అగ్రగణ్యులు. వారి ఆరోగ్య సంపద లలితకళలు, సాహిత్యము, విజ్ఞానరంగములలో వారి నిరుపమాన ప్రావీణ్యత వారి తెలివితేటలు మొదలుగాగల ఉత్తమ గుణములన్నియూ వారి ఆహారము వల్లనే వచ్చినవందురు. అటులనే చైనాదేశీయుల విషయములో కూడ వారి సముద్రపు మొక్కల ఆహారముయొక్క ప్రభావము కనుపడుచున్నది. జపానులో గాయిటరు అను వ్యాధి చాల అరుదు. కాని అనేక విషయములలో పురోగమించిన అమెరికావంటి దేశములలో కూడ ప్రజల పోషణము సరిగా లేదు.

ప్రపంచమంతటను ఆహారముగా నుపయోగింపబడుచున్న సముద్రపు మొక్కలు లెక్కకు మించినవి. పోర్ ఫైరా (Porphyra) అను మొక్కను చాల దేశీయులు ప్రియముగా వాడుకొనుట కుపయోగింతురు. ఇది ఎర్రనాచు (Red Algae) అను వర్గమునకు చెందినది. దీనిని ఉత్పత్తిచేసి ఎగుమతి చేయుటలో జపానుదేశము ప్రథమస్థానము నలంకరించినది. సాలీనా జపాన్‌లో పండించు పోర్ ఫైరాపంట విలువ 50,60 లక్షలకు పైబడును. సముద్రపు అలలు తక్కువ ప్రదేశములలో పెద్దపెద్ద వెదురుగడల కొమ్మలను నీటిలో పడవేయుదురు. వీనిపై పోర్ ఫైరా మొక్కలు పెరుగును. ఎకరమునకు సాలీనా వచ్చుపంట విలువ సుమారు 160 డాలర్లుండును.

సముద్రపు మొక్కలనుంచి అనేకరకముల రుచికరమైన వంటకములు చేయుదురు. వాటికి అలవాటు పడినవారికి అవి యెంతో ప్రీతికరముగా నుండును. సరియైన పద్ధతిలో తయారుచేసి టొమాటో మొదలైన వాటితో కలిపి తినుకొనినచో యెంతో హృద్యమైన దుర్వాసనలేక రుచిగా నుండును. ఈ వంటకములు "కరాయి మొనో" అనియూ యింకను అనేక వింతపేర్లతో వ్యవహరింపబడుచున్నవి. ఇంగ్లండు, అమెరికాదేశములలో కూడ సముద్రపు మొక్కలను ఆహారముగా అనాదికాలమునుంచి ఉపయోగించుట కలదు. ఇటీవల ఈ దేశస్థులలో యిటువంటి ఆహారముపై యెక్కువ ఆసక్తి కలుగుచున్నది. కొన్ని బ్రిటిష్, అమెరికన్ వ్యాపారసంస్థలు సముద్రపు మొక్కలనుండి తయారుచేసిన ఆహారపదార్థములను "ఆర్ గానిక్-సీ-ఫుడ్" "పార్ కెల్ప్" అను పేర్లతో అమ్ముచున్నారు. వీనిలో మానవుని ఆహారమునకు అత్యవసరమైన అయొడిన్, ఇనుము, కాపర్, కాల్షియమ్, ఫాస్ఫరస్, సోడియమ్, పొటాషియమ్, మెగ్నీషియమ్, సల్ఫర్, మాంగనీస్, అల్యూమినియం, జింక్, క్లోరిన్, మొదలైన ఖనిజములు విటమిన్ A, B D I లు కలవు. వివిధ రకములైన ఆహార పదార్థములను అందచేయుటలో సముద్రపు మొక్కలు సాటిలేనివి.

ఆహారముకొరకే గాక సముద్రపు మొక్కలు పరిశ్రమలలో కూడ ప్రాముఖ్యత గలవి. కెల్ప్

# సముద్రమొక్కలు · వాని ఉపయోగములు

(Kelps) అను ఒక రకము సముద్రపు మొక్కలు చిర కాలమునుండి అయోడిన్ తయారు చేయుట కుపయోగ పడుచున్నవి. ఇవి "బ్రౌన్ ఆల్ గే" (Brown Algae) అను తరగతికి చెందినవి. ప్రధానముగా అట్లాంటిక్, పసిఫిక్ సముద్రతీరము లందుండును. వీటిలో కొన్ని 80–60 మీటర్ల పొడుగుండి 10 80 మీటర్ల లోతు వరకు పోవును. అయోడిన్ ఖనిజములనుండి తయారు చేయు పద్ధతి కనిపెట్టక పూర్వము, అది చాలమటుకు కెల్ప్ లనుండే లభ్యమగుచుండెను. ఆధునిక కాలములో కూడ యుద్ధసమయములందును తదితర అత్యవసర సమయములందును అయొడిన్ కెల్ప్ నుండి తయారు చేయుట కలదు. పారిశ్రామికముగనే కాక కెల్ప్ లు ఆహారమునకు కూడ ప్రాముఖ్యత కలవి. జపానువారు ఎంపిక కెల్ప్ మొక్కలనుండి "కొంబు" అను ఆహార పదార్థమును తయారుచేయుదురు. జపానులో సాలీనా అనేక వేల డాలర్ల విలువగల కెల్ప్ మొక్కల పంట పండించుచున్నారు.

జాప్నుగస్తి అంటారని తెలిసినదే. దీనినే "అగర్ అగర్" అని కూడా అందురు. యిది కూడ సముద్రపు మొక్కలనుండి తయారుచేయబడును. బట్టలు తయారుచేయుట మొదలైన పరిశ్రమలలో ఉపయోగ పడుచున్నది. ముఖ్యముగా యిది జపానులో ఉత్పత్తి యగుచున్నది. సాలీనా 2, 3 లక్షల డాలర్ల విలువగల అగర్ అగర్ జపానులో తయారగును. దీనిని కొన్ని ప్రదేశములలో శీతోష్ణ పరిస్థితులు అనువుగా నున్నచోట్ల తయారు చేయుదురు.

డయటమ్స్ అనునవి మరియొక సముద్రపు మొక్కలు. వీనిలో కొన్ని జాతులు మంచినీటిలో కూడ పెరుగును. ఇవి సూక్ష్మజీవులు. కాని పారిశ్రామికముగా చాల ప్రాముఖ్యత కలవి. సూక్ష్మదర్శినిలో చూచువారికి అత్యంత సౌందర్యవంతముగా కనబడును. ప్రాచీన యుగములలో మహోజ్వల చరిత్ర కలవి. ప్రస్తుత కాలములో వీని మొక్క శిథిలములు ఫాజిల్స్ రూపములో డయటమేషియస్ ఎర్త్ (Diatamaceous Earth) అను పేర అనేక ప్రదేశములలో కన్పడుచున్నది. కాలిఫోర్నియాలో డయటమేషియస్ ఎర్త్ అనేక మైళ్ళ విస్తీర్ణము కలిగి 700 అడుగులకు పైన మందము కలిగియున్నది. శాంటా మరీనా (Santa Marina) మాగాణములో డయటమేషియస్ మృత్తిక భూమి అంతర్భాగమున 3000 అడుగుల లోతువరకు కలదు. అమెరికాలో సాలీనా 2, 8 లక్షల టన్నుల డయటమేషియస్ ఎర్త్ ఉత్పత్తి యగుచున్నది. ఇది డైనమైట్ తయారుచేయుటలోను, పంచదార ఫ్యాక్టరీలలోను, లోహముల నుపయోగించు పాలిష్ తయారుచేయుటలోను, టూత్ పేస్ట్ తయారు చేయుటలోను ఉపయోగపడుచున్నది.

మనదేశములో కూడ సముద్రపు మొక్కలను విరివిగా ఉపయోగించుటకు అవకాశము లున్నవి. మన సముద్రతీరములందు దొరకు అనేక జాతుల సముద్రపు మొక్కలు యిప్పుడు వృధా అయి పోవుచున్నవి. ఉదాహరణకు ఒరిస్సాలోని చిల్కా ఉప్పునీటి సరస్సులోనుండు గ్రాసిలేరియా అను మొక్కను అగర్ అగర్ తయారుచేయుట కుపయోగించవచ్చును. యిటులనే దక్షిణ భారత సముద్ర తీరమందు దొరకు పోర్ఫైరాను ఆహారపదార్థములు తయారుచేయుట కుపయోగించవచ్చును. ఈ సందర్భములో ఒక విషయమును తెలియజేయవలసియున్నది. కొన్ని దేశములలో సరస్సులందు పాచిమొక్కలను వృద్ధిచేయుటకు ప్రయోగములు చేయుచున్నారు. అట్లు చేసినచో ఆ సరస్సులలోనుండు చేపలకు మంచి ఆహారము దొరుకును. తిరిగి ఆ చేపలవలన మానవునికి మంచి పౌష్టికమగు ఆహారము లభించును. కాబట్టి మన దేశములో కూడ అట్టి ప్రయోగములు చేయవలసిన ఆవశ్యకతను గూర్చి రొక్కి చెప్పనవసరము లేదు. కలకత్తాలోని ఉప్పునీటి సరస్సులు, ఒరిస్సాలోని చిల్కా సరస్సు, మద్రాసు దగ్గరనున్న ఎన్నూర్ ఉప్పు నీటి సరస్సు యిట్టి ప్రయోగములకు వీలుగా నుండును.

ఆ మాట అవగానే తలారి అక్కడనుంచి వస్తానని గబగబ వెళ్ళిపోయాడు. [illegible] వాడి పేరూ, వృత్తీ ఇంకా యెన్నో వివరాలు కనుక్కుందామనుకున్నాను గానీ మళ్ళీ అగపడలేదు

ఈ నాలోసారి కలయికవరకు వీడు త్రాగుబోతని అనుకోడానికి ఆస్కారం యిచ్చానుకోడు. నామనసులో రెండోసారి కలయికనించీ యీ వ్యక్తి చాల వున్నతంగా మెసలుతున్నాడు ఈ అభిప్రాయమే కొంతవరకు నన్ను వాడివెంట నడిపించింది.

ప్రక్కవీధి గొందిలో చిన్న పెంకుటిల్లు— ప్రేతాలయంలాటిదిలా వుంది. తలుపు దడదడా బాదాడు లో నుంచి పొమ్మని అరుపు. ఈ త్రాగుబోతు తలుపు తియ్యమని కొంకుకు నానా తిట్లూ తిట్టూ అరిచాడు తలుపులు తెరవబడ్డాయి నిప్పులాంటి కళ్లతో చేతులు పాముపాలకాలా విసురుతూ చెయ్యెత్తుకు వాడు యెగురుతూన్నట్టు తండ్రి అరిచాడు.

“గాడిదకొడకా! పెద్ద మనిషిని తెచ్చావు. మర్యాద యియ్యరా!”

ఆ తీక్ష్ణమైన కళ్ళు తొలిసారి నాకున్నట్టు ఒక మూలనున్న నావేపు చూడగానే శాంతించినయ్

“కూర్చోండి” అంటూ రెండు తలుపుల వెనక మూలనున్న చొట్టకుర్చీ ముంగుకు లాగాడు వెళ్ళి కూర్చున్నాను తండ్రి గొంతుక ఒక్కసారిగా “నా ముందు పుట్టాడు గాడిద! ఈ చేతుల్తో దస్సం పూసేవాడినే ఆ పిల్లి చూపులా అకళ్ళు పులిలాగ —ఉత్తి రౌడీవెధవై పోయాడు!”

కొడుకు కళ్ళు యీ మాటలతో మరీ యెర్ర బెక్కుతున్నాయ్. తండ్రిని ఆగమని సైగచేస్తూనే వున్నాను. అంతలో కొడుకన్నాడు “త్రాగుతున్నాడు. మరేం చెప్పినా వాడికి యెక్కదు!”

తండ్రి నా నోటిలో నోట ‘హా’ అంటూ పూది. “తాగాను. పొరపాటుమాట ఒక్కటంటే నీ చెప్పు తీసి నన్ను కొట్టు ఈ వెధవ నామీదా కన్నెర్ర చేస్తాడు? ఎన్నిగుండెలుండాలి?”

కొడుకు ముంగుకొస్తూ “నీ బతుకెంతో వీడూ అంతేలే నేను కాబట్టి యిన్నీ సహించుకొస్తున్నాను.”

“పెద్ద పెద్దోళ్ళా తాగుతున్నారు—నేను తాగుతున్నాను. నువ్వు కొత్తగా తాగిన వెధవలా మాటాడకురా ”

“నిన్నా గున్నపోతుని నీతో నాకేం పని?” అంటూ కొడుకు వెనక్కు తిరిగాడు.

ఈమాట నాకు వింతది అనిపించి “మీరు కూడా మీ తండ్రిపగిడీ తీసుకున్నారా?” అన్నాను కొడుకు ఆమాట వినగానే నావేపు తిరిగాడు ఆ యెర్రటి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగిపోయాయి నా దగ్గరగా వస్తూ “మీకు తెలీదండీ నాకు జ్ఞానం వచ్చినదగ్గరనించీ చూస్తున్నాను ఒక వ్యసనంలాగా బజారునిండా ముంచేసే నన్ను చంపినన్నాళ్ళూ పడ్డాను నా కళ్లతో మా అమ్మ ఒక్కంత పిండి చేసిన్నాడు చేసిందిలేక సహించాను” ఇంతలో తండ్రి యేదో అడ్డుపడ్తున్నా వినిపించుకోక “ఇంతవాడ్నయ్యాగా! ఇప్పుడూ నా యెదురుగా మా అమ్మ యెముకలు విరగొట్టంటే చూస్తూ యెలా వూరుకోమంటారు?” అంటూనే బొలబొలా కన్నీళ్ళు కారుస్తూ గబగబ వంటింటికివెళ్ళి తల్లి చెయ్యిపట్టుకొని లాక్కొనివచ్చాడు.

కొద్దిగా చాటుగా నిల్చున్నా నా కంటికామె కనిపించింది గాలివస్తే పడిపోయేటట్టుంది ఆ వంచిన దుఃఖాన్వితమైన ముఖం చూడగానే నాకళ్ళల్లో నీరు చిమ్మింది వాడిన బట్టలతో ఒక చిత్రంలోలా వున్న ఆమెను, ఆ మృదుతను, ఓర్పును చూసి నా శరీరమంతా ఒక్కసారి ఆవేశంతో పొంగింది. ఆమెను ఓదార్చాలన్నంత కోరిక కలిగింది.

కొడుకు కళ్ళు తుడుచుకుంటూ “యింత చంపుతున్నా ఒక మాట యెదురాడదు గొడ్డుమనిషి యిట్లు బాదితే మా అమ్మ మా కంటికి యింకెంతకాలం కనిపిస్తుందండీ? ఈ ప్రేమకైనా నేను నోచుకోవద్దా?”

ఆమె అక్కడనించి వెళ్లిపోయింది. వెళ్ళిపోతూ ఆమె కళ్ళల్లో నీరు జారటం చూశాను నా కథలో త్రాగుబోతుకు భార్యరూపు నా కంటికిప్పుడు అగపడింది. ఈలోగా తండ్రి యేదో పెద్ద గొంతుకతో అంటున్నాడుకాని వినిపించుకోలేదు. తండ్రే నా భుజంమీద గట్టిగా తట్టూ “చెప్పు తప్పెవరిది?”

వింతలనులతో నతిమను సర్వోన్నతమైన దని యని కవి నిరూపించుచున్నాడు —

'దళితలతాంతకాంతియును దంతురకాంతి శిలాంకు ట్వాలటి, న
మ్మిళిత సరోజనిలాసముల మీటిన విద్రుమ ఫలస్త స్త్రాగముల్
వెలికడఁ, గప్పెఁ, దక్షిణపు వెల్లిత త్రోవద ధూమ ధూమకుం
తలములు విచ్చి, చాదములతోలతకాంగి, కృపాలు కెంకటన్'

(ఆ 1—ప. 155.)

ముందు కలుగనున్న గిరికావసురాజాల వరూశేకము సూచించుచున్న యీ వర్ణనము, తన్నుపాసించిన రసికులను మంచి ప్రకృతి యెట్లు బంధింపగలదో చెప్పక చెప్పుచున్నది. నానావిధ పద్మ కేళి ప్రేరణలచే నాంతరంగిక ప్రబోధ మేర్పడి యపూర్వభావ పరిస్ఫూర్తి కలుగుచున్నది. అపుడు భౌతిక మానవ ప్రకృతుల యభేదము ఘటిల్లి యుదిరు, దైవీప్రకృతియగును. లేదా యీ రసోపాసనవిశ్రాంతి పరాకాష్ఠ దైవీప్రకృతియే భౌతిక మానవప్రకృతులతో సమ్మేళనమై, సమైక్య సమన్వయమై, మధుర సమగ్రమై శేషార్థమునందునకు సుసంఘటితమగును. దేహప్రాణమనోధాతువుల నతిక్రమించి యాత్మకు విశుద్ధజ్ఞానభూమికలో నడు గిడుటతో భిన్నభిన్నప్రకృతుల మూలకారణ సాక్షాత్కృతి యగు ననుటయే యిది ఇట్టి సమ్యక్ ప్రకృతిదర్శనము నించుక గా నుదాహరింతును.

వేవేదలింపఁ, గంధిత నవీనతృణాళి ఘనాగ్రకోరక
ప్రేణి నటింప, లోలశఫరీనికరీసకటాక్ష కాంతి వి
న్యాసము మావు శాంతనగ[illegible] నంబును మీఱు
వైశత
శ్రోణి నివర్తితాబ్జములకోభితయై కడు సంభ్ర
మించినన్.

(ఆ 2 ప 187)

ఇందలి మలధ సుందర శ్లేషచే నతియందు స్త్రీత్వ మర్ధనారీశ్వరకాండనమున తోలుదొర్క ద్యోతక మగును. ఏదన నాయాధూతముల పృథగ్భావ మేక సముగా తెల్పుచు మనోజ్ఞ మగుచున్నదో, యపుడే ప్రకృతి తత్త్వము గూడ సుక్షేత్ర మగుటచే మన కానందోపలబ్ధి.

కొలని జలక్రీడల సందర్భములో రామరాజ భూషణుడొక ప్రౌఢదర్శన మిప్పించుచున్నాడు. ఆ పద్యభావ మిది ఒండొరుల భుజములపై చేతులు వైచి మెడపర్యంతమైన నీటిలో చెలులు నిల్చియున్నారు. తమ భుజావలయములచే నేర్పడిన మండలమధ్యమున వారి కన్నులదామముల కాంతి ప్రసరించుచున్నది. అపు డా కాంతిస్తోమము మన్మథ గేహమను తెప్పతిరు నాళ్ళలో కట్టిన పాశబంధములుగల, తమ్మికాండ్ల వలయములతో గూడిన పూలతెప్పవోలె యున్నట్లున్నది. పరికించునది:

'కరములమీఁదఁ బ్రోయాడుకొని కన్నులు, దమ్ములబంటి
నీరమున్
బరగొని నిల్వ, తత్పృథు ప్రాంశుపృగండుకలాప
పూరితం
తరమయి పొల్చె, భావభవదైవతభావితహేము
బంధనం
దిరితమృణాళిమంజులితపద్మముయుక్తకమండ
లంబనన్'—(ఆ 3 ప. 156)

భౌతిక, మానవ, మానవాతీత ప్రకృతిత్రయ పరస్పర సంబంధమును గుర్తించిన మహాకవి, ప్రకృతిని స్థిరరసమూర్తి యనుకొనుమా! అతఁ డట్లనుటకు హేతు వైనది, మహోదారమైన యాతని ప్రకృత్యాలోకన వ్యాపార ధోరణి కాఁగా, జడమునుండి మానవప్రకృతి ప్రభవించి దైవీప్రకృతిగా పరిణమించుటయనుఁడు, లేదా మూలాధార దైవీ ప్రకృతినుండి ప్రోద్భూతమైన విశిష్టమానవప్రకృతి, బాహిరజడప్రకృతిలో విలీనమై, స్వస్థితినుండి విరమించి పునర్దైవీప్రకృతిగా రూపొంది, రమించి విరమించుట యనుఁడు, ఈ విలోమానులోమ రమణవిరమణ లీలలకు నిరాడంబరమూ, మాత్రమూ కవికి మని మనోగతమై భావస్థితరూపముగ ప్రకాశించు జన్మజన్మాంతర వాసనావిలసితమగు ప్రకృతిబద్ధ భక్తిభావమును, ఆరాధనాశీలమును గాదనగలమా!

అచేతనములకు కుతూహలోల్లాసములతోను మానవోపమానములచేత, చేతనత్వము కలిగించి, తత్ప్రేరణఫలమైన గిరికాదేవికి కేవాంకగల యుపరిచరవసు సంతతికాను వసురాజును ధర్మిగాపొర్చి, రసధుని యనదగు కావ్యమును నిర్మించిన కవీంద్రుని యాంతర్యాంతరము, ప్రకృతి పరిశీలనాబద్ధ భక్తిభావమును తద్రూపనివేదనసంఘటనాసామర్థ్యమును గంటిరా!

# ఇల్లు కూలింది

శ్రీ అంగర సూర్యారావు

పాత్రలు: రామ్మూర్తి, నారాయణ, శేఖరం, రమణయ్య, నరసయ్య, ప్రకాశం, కుచేలరావు, బిల్లుకలెక్టరు నీలవేణి.

* * ఒక ఆఫీసులోని పెద్ద హాలు. హాలు మధ్య రికార్డు రూంలోకి వెళ్లేద్వారం కనిపిస్తోంది. ద్వారానికి యిరువైపులా హాలులో రెండు బల్లలూ రెండు కుర్చీలు ఒకదానికి ఒకటి యెదురుగా వున్నాయి. ద్వారానికి ఎడమవైపు వున్న సీటులో శేఖరం కూర్చుని వున్నాడు. వయస్సు 25 సంవత్సరాలు. రాస్తూ మధ్యమధ్య కుడివైపుచూస్తూ వున్నాడు. హాలుకు ఎడమవైపున ఒక ద్వారం కనిపిస్తూవుంది. పైవాళ్ళు వస్తే కూర్చునేటందుకు హాలులో మరో రెండు ఖాళీ కుర్చీలుమాత్రం వున్నాయ్. కుడివైపునుంచి రమణయ్య నరసయ్య వస్తారు. ఇద్దరూ వలిసిపోయిన పంచెలు, అతుకుల చొక్కాలు వేసుకొని వున్నారు. తలపాగాలు చుట్టుకున్నారు. వయస్సు రమారమి 40 సంవత్సరాలు. ఇద్దరి ముఖాలలో అత్యుత్కృష్టదైన్యం, తొందరపాటు కనిపిస్తూ వుంటాయి.

రమణయ్య : (వస్తూనే) అయ్యా నమస్కారం.

నరసయ్య : నమస్కారం బాబూ!

శేఖరం : ఎవరు మీరు?

రమ : నా పేరు రమణయ్య అండి

నర : అందరూ రమణయ్య మేష్టారు అంటారులెండి.

రమ : వీరిపేరు నరసయ్యగారు

నర : మేం యిద్దరం బడిపంతుళ్ళమండి.

శేఖ : ఎందుకు వచ్చారు?

రమ : సావధానంగా వినాలి తమరు. అంతా పూస గుచ్చినట్లు మనవిచేస్తాం.

నర : బొమ్మనగరంనుంచి యిక్కడిదాకా ఆలోచించుకుంటూనే వచ్చాం. బోల్డు సంగతులున్నాయి మనవిచేసుకోటానికి

శేఖ : మీరు కొంతసేపు

రమ : (ఆతురంగా మధ్యలో అందుకొని) బాబ్బాబు! అభ్యంతరం చెప్పకండి.

నర : మా మనవి వినండి

రమ : మాది తప్పయితే దండించండి ఒప్పుకుంటాం.

[శేఖరాన్ని మాట్లాడనివ్వకుండా యిద్దరూ చెరొకటీ చెప్తూ వుంటారు.]

రమ : మేం కులానికి గొప్పవాళ్ళం

నర : అయినా కూటికి లేనివాళ్ళమండి.

రమ : బడిపంతుళ్ళమంటే లోకులకు చులకన. మా కష్టాలు ఎక్కడ చూస్కున్నా యేమండి.

నర : ఈ మేష్టరు విద్యార్థులకు సరస్వతే చాలు మాత్రమే! ఏమి చేస్తాం." అంటున్నారు.

రమ : మళ్ళా మాట్లాడితే మళ్ళా మొదలెట్టేం బొమ్మంటున్నారు.

శేఖ : ఎవరు ? (యింకా యేదో అనబోతాడు)

నర : (మధ్యలో అందుకొని) యిక్కడ బాబయ్యగారే మా పైవాళ్ళు.

రమ : అంటే మా నెత్తిమీద వున్నవాళ్ళు.

నీలవేణి : (నవ్వుతూ) ఎక్స్‌లెంట్ మి. శేఖర్! నిన్ను డిజపాయింట్ చేశాను

శేఖ : నువ్వు చెప్పినట్లు ఉదయానే వచ్చి కూర్చున్నాను. అప్పటినుంచి మొహమొప్పి పెట్టె వరకూ ఎదురుచూస్తూ వున్నాను

నీల : మా పిన్నిని స్కూల్లో చేర్పడానికి వెళ్లాను. అక్కడ నాకు చదువుచెప్పిన టీచర్ ఒకావిడ కనిపించారు. నేను ఉద్యోగం చేస్తున్నానని చెప్పగానే ఆవిడ యొక్క కేసి సంతోషం వచ్చింది. చాలాసేపు మాట్లాడుతూ కూర్చో బెట్టేం. ఆవిడే వదిలించుకొని వచ్చేసరికి యీ టైమయ్యింది

శేఖ : హాయిగా నీతో కొంతసేపు మాట్లాడవచ్చు కదా అని ఉదయమే వచ్చాను. నువ్వు రాలేదు సరికదా, మధ్యాహ్నం తినవలసిన చివాట్లు ఉదయమే తిన్నాను

నీల : అదేం?

శేఖ : నువ్వు ఎప్పుడొస్తావా అని రోడ్డుకు చూస్తూ కూర్చున్నాను. జోరుగా చప్పుడు వినిపించి ఆతృతగా చూశాను. నీ నవ్వుముఖానికి బదులు మా సెక్షన్ హెడ్ తెలుముఖం కనిపించింది

నీల : ఆ ముసలాయనగారు అప్పుడే వచ్చారా?

శేఖ : పులి మనిషినట్లు ఉదయమే వచ్చి తిరుగుతున్నాడు. ఎకౌంట్ బ్రాంచ్ లేదని నానా హంగామా చేశాడు

నీల : (చుట్టూ చూసి) యేరీ! కనిపించరేం?

శేఖ : రాగానే యెవడో మహానుభావుడు దొరికాడు. అతనితో యిప్పుడే బజారుకు వెళ్ళాడు

నీల : మేనేజరుగారు వచ్చారా?

శేఖ : లేరు. బ్యాంకుకువెళ్లి డబ్బు తీసుకువస్తారు. ఆయన వచ్చేసరికి చాలా ఆలస్యం అవుతుంది.

నీల : ఇవేళ ఒకటవ తేదీ కదూ! మరిచిపోయాను.

శేఖ : ఈ మధ్య నీకు మరుపు యెక్కువ అవుతోంది.

నీల : అంటే?

శేఖ : మనసు స్థిమితం లేకపోతే మరుపు ఎక్కువవుతుం దంటారు.

నీల : నిన్ను చూస్తూవుంటే నా కాన్వెంట్ మాష్టరు జ్ఞాపకం వస్తూవుంటాడు.

శేఖ : అతనుకూడా నాలాగే వుంటాడా?

నీల : రూపంలో కాదు గుణాలలో—'మరుపు ఎక్కువ',—'దిక్కులు చూస్తూవుంటావు'—మొదలైన మాటలు ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటాడు

శేఖ : నువ్వేమీ అనుకోకపోతే ఒకమాట అడుగుతాను

నీల : ఏమి టది?

శేఖ : ఇంతకాలంవరకూ నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు.

నీల : చిన్నతనమ్నప్పుడే చేతులకు సంకెళ్ళు తగిలించుకోమంటావా?

శేఖ : అంటే స్వేచ్ఛగా తిరగడానికి వీలుండదనా?

నీల : (కోపంతో) యేమిటా మాటలు?

శేఖ : యేమీ అనుకోకు నీలవేణీ! నీ పద్ధతులు నాకు వింతగా కనిపిస్తున్నాయ్. అసలు జీవితంగురించి, భవిష్యత్తుగురించి నువ్వు కొంచెమైనా ఆలోచిస్తున్నావా అని నా సందేహం

నీల : ఇంతవరకూ ఆలోచించలేదు. ఇకముందుకూడా ఆలోచించను.

శేఖ : నీ ఉద్దేశం?

నీల : సంతోషంగా జీవితం గడపడమే నా ఆశయం. జరిగిపోయినవాటిగురించి కాని, జరగబోతున్న వాటిగురించి కాని చింత మనసు పాడుచేసుకోను

శేఖ : నీతో చాలా విషయాలు మాట్లాడాలి నీలవేణీ!

నీల : (ముగిసే కళ్ళతో అతని ముఖంలోకి చూస్తూ) నాతోనా!

శేఖ : అవును నీతోనే!

నీల : కొంపతీసి నువ్వుకూడా నన్ను ప్రేమించావనవు కదా?

శేఖ : ఇదివరకే యెవరైనా అన్నారా?

నీల : అవన్నీ యిప్పుడెందుకు!

శేఖ : సరే, సాయంత్రం యింటికి వెళ్ళేముందు నన్ను పిలూ యిద్దరం కలిసి వెడదాం

నీల : ఎక్కడికి?

శేఖ : సినిమాకు, బీచికి, పార్కుకు—యెక్కడికైనా సరే, యేకాంతంగా మాట్లాడ్డానికి వీలుండే చోటుకు

నీల : ఇక్కడ ఎవరూ లేరుగా చెప్పు

శేఖ : ఈ కాగితాల చిట్టడవిలో—క్రూరమృగాల వంటి సెక్షన్ హెడ్స్ తిరిగే చోటులో

చెయ్యలేకపోతే మూసైకోవడం నయం (కాగితాలు తీసి చూస్తూ) కొనియ్ రాయల్ కొనియ్, మళ్ళీ కప్పెట్టినంత పని వుంది.

[శేఖరం రామయ్యకి తొందరగా అంకెలు కూడుతూ వుంటాగా కుడివైపు నుంచి ప్రకాశం వస్తాడు. వయస్సు 20 సంవత్సరాలు అమెరికన్ జాకెట్, ఫుల్ ప్యాంట్, బూట్లు, చేతికి రిస్టు వాచీ—ముఖంలో చురుకుతనం, ఉత్సాహం కనిపిస్తూ వుంటాయి]

ప్రకాశం (రామయ్యని పలకరించి) మా నాన్నగారు లేరా?

రామయ్య (తల పైకెత్తి) నువ్వా బాబూ! కూర్చో!

ప్రకా (కుర్చీలో కూర్చుని) యెక్కడికి వెళ్ళారు?

[శేఖరం ఓ సారి ప్రకాశంకేసి చూసి తిరిగి పని చేస్తూ వుంటాడు]

రామయ్య. బ్యాంకుకు వెళ్లారు. పది నిముషాలలో వస్తారు యేమిటి విశేషం?

ప్రకా పుస్తకాలు కొనాలండీ. డబ్బుకోసం వచ్చాను.

రామయ్య (చేతిలో కలం చెవిమీద పెట్టి కుర్చీకి చేరబడి) అలా చెప్పు! అసలు నిన్ను చూడగానే అనుకున్నాను.

ప్రకా (నవ్వుతూ) యేమని?

రామయ్య డబ్బుకోసమే వచ్చివుంటావని

ప్రకా: లేకపోతే మీ ఆఫీసుకు రావలసిన ఖర్మ నాకేం పట్టిందండి?

రామయ్య నిజమే బాబూ, నిజమే! ఖర్మ పట్టింది కాకపోతే యిక్కడికు వస్తారు (సీరియస్‌గా) చూడు ప్రకాశం నీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను

ప్రకా చెప్పండి

రామయ్య మీ నాన్నగారు యెంతో కష్టపడి నిన్ను చదివిస్తున్నారు. ఎందుకని?

ప్రకా: (తేలికగా) అది ఆయన ధర్మం కనక!

రామయ్య ధర్మం కాదు (కోపంతో) నీలాంటి కొడుకు వుండటం ఆయన ఖర్మం.

ప్రకా (కోపంతో) యేమిటండోయ్ రామయ్యగారూ! చాలా దూరం వెడుతున్నారు!

రామయ్య: నిన్ను గొప్పవాణ్ణి చెయ్యాలని ఆయన ఉద్దేశం. మాలాగ గుమాస్తా బతుకు బతుకుతూ అష్టకష్టాలూ పడకుండా—నిన్ను మంచివారిలో చూడాలని ఆయన అభిప్రాయం నిన్ను చదివించడంలో ఆయన చేసిన అప్పులు యిన్నీ అన్నీ కావు. ఆయన యిప్పుడు పూర్తిగా మునిగిపోయి వున్నారు.

ప్రకా నన్నేం చెయ్యమంటారు?

రామయ్య నువ్వేం చెయ్యొద్దు బుద్ధిగా చదువుకో! డబ్బు దుబారా చెయ్యకు.

ప్రకా మీ మాటలు నాకు బోధపడటం లేదు.

రామయ్య (హేళనగా) యేలా బోధపడతాయి నాయనా! కాస్త గట్టిగా చెబితే బోధపడవు పెళ్ళి యిష్టం మనకు పిల్లలు పుట్టి "నాన్నా, మాక్కావాలి—పుస్తకాలకు డబ్బు" అని వేధించేదాకా బోధపడవు.

ప్రకా పుస్తకాలు కొనకపోతే చదువేలాగ?

రామయ్య అబద్ధం ఆడకుండా చెప్పు నువ్వు ప్రతి నెలా పుస్తకాలు కొంటున్నావా? నువ్వు అడిగే ఆత్రుతలో సే—నీ మీద ప్రేమకొద్దీ మారు మాట్లాడకుండా మీ నాన్నగారు నీకు డబ్బిస్తున్నారు—ఆ సంగతైతేనా? (సీరియస్‌గా అతని ముఖంలోకి చూస్తూ) నీకు డబ్బెందుకు కావాలి? యేం పుస్తకాలు కొంటావు? యీ విషయాలు నా దగ్గర ఎదరాపద! పుస్తకాల షాపు దగ్గరకు నేనుకూడా వస్తాను అనివుంటే వాడ్ని

ప్రకా (లేచి) పావుగంట పోయాక వస్తాను. (వెళ్ళబోతాడు)

రామయ్య కూర్చోవోయ్! కూర్చో! రెండు మాటలు చెప్పనీ మీ నాన్నగారు యెంతో నిజాయితీ అయిన మనిషి. లక్ష్మణాదు కోకుండా పని చేస్తారు అయినా—రిటైరయిపోయే వరకూ నీకే—యిప్పటికీ మేనేజరుగా ప్రమోషన్ వచ్చింది ఆయన సంపాదనంతా నీకిందే ఖర్చు పెడుతున్నారు ఎప్పుడూ రోజులు ఒకలాగే వుంటాయనుకోకు ఒక సంవత్సరంలో ఆయన రిటైర్ అయిపోతారు. ఆ తరవాత సంగతి ఆలోచించు.—ఇప్పటినుంచైనా కొంచెం జాగ్రత్తగా మసులుకో! ఒకటికి రేపు వచ్చే వరకి యిక్కడకు కొబ్బరికాయలాగ సిద్ధమవ్వకు

# కలగూరగంప

## నాగరికత

శ్రీ నాగభూషణం

సంఘ జీవనము సమస్త ప్రాణికోటిలో కన్పించే సహజలక్షణం బలీయమైన అవసరం కూడా. స్వజాతికి సంబంధించిన జీవులన్నీ ఒక కూటమిగా జీవించటం మనం తిలకిస్తూ ఉంటాం. కోతులు ఒక కూటమిగా, భ్రమరాలొక కూడికగా, మత్స్యములు మరొక కూటమిగా ఉండటం మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. పైన పేర్కొనిన "స్వజాతీయాకర్షణ" మానవునిలో కూడ ఉండే సహజ లక్షణం. ప్రయోజనం దృష్ట్యా, సంఘజీవన బద్ధతగల ఆవశ్యకతను, మానవుడు మరింత గుర్తించాడు. పరస్పర సహాయ సహకారాలే మానవ జీవితాలను సుభిక్షం చేస్తాయి. ఐకమత్యం ముఖ్యం కావాలంటే మానవుడు తప్పనిసరిగా కొన్ని నియమ నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. కాలగమనంతోపాటు మానవజీవిత విధానాలు పెంపొందుతూ ఉంటాయి. జీవిత విధానాలను సాధించే ప్రయత్నములో నాగరికత పురోగమిస్తూ ఉంటుంది. జీవితం మరింత సుఖవంతము చేసుకోవాలనే తీరని కోరిక, కళాతృష్ణ నాగరికతా పురోభివృద్ధికి ఆధారభూతాలు.

నాగరికతకు ఒక రూపాన్ని ఆపాదించి, ఆ ప్రత్యేక రూపమే "నాగరికత" అని ఇదమిత్థంగా తెల్పి చెప్పటం కష్టం. జాతి, జాతికీ, దేశదేశానికీ మధ్య నాగరికతా స్వరూప స్వభావాలలో వైవిధ్యం ఉండి తీరుతుంది.

వారి వారి, దేశ కాల పరిస్థితులు కళాదృష్టి, అవసరాలు, అభిరుచులు, నైతిక దృష్టుల ప్రభావ ఫలంగా, నాగరికతా స్వరూప స్వభావములలో వైవిధ్యం ఉంటున్నది. ఇందుమూలముగా ఒక జాతి లేక ఒక దేశ నాగరికత ఉదాత్తమైనదని నిర్ణయించడం కష్టం. ప్రయోజనం దృష్ట్యా, కళదృష్ట్యా, ఒక నాగరికత, ఉత్కృష్టత సాపేక్షంగా మాత్రం, నిర్ణయించవచ్చును. ఈ విధంగా కాక ఒక నాగరికత ఉత్కృష్టతను నిర్ణయించే సమయములో, వారి వారి దేశకాల పరిస్థితులు, అవసరాలు, అభిరుచులు, నైతిక దృష్టులను, మనం దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. మానవుని "భౌతిక సాధన, సంపద, మేధా"లనే నాగరికత అని స్థూలంగా నిర్వచించవచ్చును.

ప్రస్తుతం మనం నాగరికతగా పరిగణించే విషయాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చును (1) భౌతిక నాగరికత (2) అభౌతిక నాగరికత

### భౌతిక నాగరికత

పంచేంద్రియాలద్వారా గ్రహింపబడునది భౌతికము. మానవ నిర్మితమైన భౌతిక సాధనాలే "భౌతిక నాగరికత" గృహనిర్మాణము, వస్త్రోత్పత్తి, ఆహారోత్పత్తి వగైరాలను మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. మానవావసరములు రెండు రకములు (1) మూలావసరములు (2) కల్పితావసరములు. మూలావసరములు జీవించుటకు తప్పనిసరి అయినవి. ఆహారము, నీళ్లు, గాలి వగైరాలను మూలావసరములుగా పేర్కొనవచ్చును. వస్త్రధారణ, గృహవాసము వగైరాలను కల్పితావసరములుగా పేర్కొనవచ్చును. కల్పితావసరములు లేకున్నను మానవుడు జీవించగలడు.

మానవప్రయత్న ప్రమేయం లేకుండా ప్రకృతి ప్రసాదితమైన ఆహారముతోనే ఆదిమానవుడు జీవించేవాడు. కాలగమనంతోపాటు ఆహారపు కొరత ఏర్పడినది. ఆ కొరతను తీర్చుకొనుటకు మానవ ప్రయత్నాన్ని మేళవించి, ప్రకృతిని వినియోగించుకోవలసి వచ్చింది. ఈ విధంగా మూలావసరాలే నాగరికతా పురోభివృద్ధికి ప్రథమ సోపానమైనది. కల్పితావసర సాధన సంపత్తే నాగరికతకు ద్వితీయ సోపానము. జీవితాన్ని

మరింత సంతోషదాయకం చేసుకోవాలని తీసిన కాంతి, కళాదృష్టి, అభిరుచి, వగైరాలు, నాగరికతను ద్విగుణీకృతం చేసే మూలాంశాలు.

ఈ విధంగా పురోభివృద్ధి పొందుతున్న భౌతిక నాగరికతకు పరాకాష్ఠ అంటూ ఉండబోదు.

## అభౌతిక నాగరికత

అభౌతిక నాగరికతను మరల రెండు విభాగములుగా చేయవచ్చును (1) నైతిక నాగరికత (2) మేధాత్మిక నాగరికత

## నైతిక నాగరిక

మానవునిలో కొన్ని మూలసూత్రములు అంతర్వ్యాపితమైయున్నవి. అవి ఆకలి, కామం, క్రోధం, స్వార్థం వగైరాలు. ఆది మానవుడు నియమ నిబంధనలు లేకుండా పై లక్షణములను యథేచ్ఛగా ప్రవర్తించేవాడు. అప్రవర్తన ఫలితంగా అతడు అనేక కష్టనష్టములను ఎదుర్కొనవలసి వచ్చినది. జీవన క్లిష్టత కూడా ఏర్పడింది. జీవిత సక్రమంగా నడవడానికి కొన్ని నియమనిబంధనలకు బద్ధుడు కావలసివచ్చింది. ఆదిమానవుడు క్షుద్బాధని తీర్చుకోవటానికి, నిరతిమైన పనిని అంటూ లేక, దొరికిన మార్గము తొక్కేవాడు. కామతృష్ణను, వావివరసలు లేక, సమయాసమయములు లేక తీర్చుకునేవాడు. కేవలం మనోకోర్కెలను తీర్చుకోవటమే ప్రధానోద్దేశ్యంగా ఆదిమానవుడు ప్రవర్తిల్లాడు. పైన పేర్కొనిన మానవ సహజగుణములను అదుపాజ్ఞలలో బంధించి ప్రవర్తించుటయే నైతిక నాగరికత.

## మేధాత్మక నాగరికత

ఈ సృష్టి అనంతమైన సమస్యలతో కూడుకొని ఉంది. కొల్లగా కేవలా క్రొత్త సమస్యలూ ఉద్భవించవచ్చును. జలములోని ధూరితము లెవ్వి? ఒక వస్తువును పైకివిసరిన క్రిందికి రాంగుకు పనేటి? లాటి అనేకానేక సమస్యలకూటమే ఈ విశ్వం. మానవుడు దాని మేధస్సును వినియోగించి సమస్యలను పరిష్కరిస్తూ ఉంటాడు. భౌతికా భౌతిక సమస్యాపరిష్కారంలో మేధాత్మక నాగరికత అని పిలువబడుతుంది.

## కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు



సుప్రసిద్ధ గాంధేయవాది, సాహిత్య విద్యా విశారదులు, వైజ్ఞానిక ప్రచారకులు సంఘసేవాధురీణులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ఈ సెప్టెంబర్ 25 వ తేది బుధవారం రాత్రి పరమపదించిన వార్తను పాఠకులకు అందజేయవలసి వచ్చినందుకు చాలా విచారించుచున్నాం. నాటికి వారివయస్సు 81 సంవత్సరాలు. ఉన్నవ దంపతుల కార్యక్రమానికంతకూ రంగస్థలమైన గుంటూరు పట్టణమునందే ఆయన దేహం చాలించారు. వారి సహధర్మపత్ని లక్ష్మీబాయమ్మగారు మరణించి ఇప్పటికి సరిగ్గా 12 సంవత్సరాలైంది.

'మాలపల్లి' రచనతో లక్ష్మీనారాయణగారు ఆంధ్రసాహిత్య ప్రపంచానికి ఒక వెలుగుబాటను చూపించారు. భావావేశకంగా ఆంధ్ర వాఙ్మయంలో అది ఒక మహావిప్లవం. 'మాలపల్లి' నవలను ఢిల్లీ సాహిత్య పరిషత్తువారు జాతీయభాష లన్నిటిలోకి తర్జుమా చేయించుచున్నారు. ఈ నవల సినిమా రూపంలో కూడా దర్శనమిచ్చే భాగ్యం త్వరలోనే లభించవచ్చు. ఈ వార్ధక్యంలో కూడా ఆయన కలం దించకుండా సాహిత్య సేవ చేస్తూ వుండటం ఆశ్చర్యకరమైన సంగతి. తిక్కనపై వారు ఒక మహాగ్రంధాన్ని రచించి మెరుగుదిద్దుతూ వున్నట్లు చెప్పుకుంటున్నారు.

స్త్రీ విద్యారంగంలో స్త్రీ పురోగమన రంగంలో ఆ దంపతుల కృషి అజేయమైనది. 'శారదా'

. . . . . ..

కోగు పొలంబట్టు దుమ్ములో, నీడ జాడ
మబ్బులో దండిప్పు, మునరేల, దిగినప్పు—

ఈ మొదలైన చోట్ల ఊహాపత్యత గోచరిస్తున్నాయి. "ప్రశాంత ప్రకృతి" అనే శీర్షికలో వీరు వలంకరించిన ఓక అభిప్రాయాన్ని యిక్కడ పరామర్శించడం అవసరం.

కవులు పూజ్యము మీ తెలంగాణమీద
పచ్చని గుడ్డ్విధ మా పులకరించి—

ఆ అన్న దాశరథి' తెలియనివారై వుంటారు

ప్రతిభ అనేది దేశకాల నియంత్రితం కాదు కదా!

వీరు పోతనగారి జీవితమును వస్తువుగా స్వీకరించి కావ్యమొనరించినట్లూ, తద్ద్వారా ప్రవక్తవల్ల ఆ ప్రాంతంలో "అభినవపోతన" బిరుదాంకితులుగా ప్రసిద్ధులైనట్లూ, ఈ సంపుటి పీఠికవల్ల తెలుస్తున్నది.

అవి బయటికివస్తే వీరి సమగ్ర కృతి అవగాహన చేసికోగల అవకాశాన్ని ఆంధ్ర రసజ్ఞులకు కల్పించు గాకయని ఆకాంక్ష

## రక్తాక్షి

శ్రీ సోమసుందర్ ప్రచురణ రచయిత కళా కేళి పబ్లికేషన్స్ పాపన్నకోట తూర్పుగోదావరిజిల్లా. వెల తెలియదు

'రక్తాక్షి' ఖండకావ్య సంపుటిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలోని వన్నీ 'అభ్యుదయ' ధోరణిలో ఖండకావ్యాలు. రెండవ భాగం

కూడా ఇలాగే సాగిపోతుంది. మూడవభాగం పత్రికాకాల భ్రాంతి గొలిపే ఖండకావ్యసముదాయం.

మొదట భాగంలోని ఖండికలు చాలావరకు 'అభ్యుదయ' రచనలు రెండవభాగం మూడవ భాగం కొంత నాటకీయబంధాలలో సాగాయి మూడవ భాగంలో కీర్తికాముకుడుగా అక్కడక్కడ అభ్యుదయ ధోరణి కనిపించినా ప్రాచీనార్ష సంప్రదాయాలు, ఆదర్శాలు, ఎడనెడ ప్రత్యక్షమౌతూంటాయి.

ముఖ్యంగా ఈ భాగంలో రచయిత కొత్తకొత్త ఛందస్సులు వాడి, అది చాకచక్యంతో నిర్వహించారు దీనికి క్రింది రచన తార్కాణ ఇది 'విప్లవం' అనే శీర్షికలోని రచన

'తనయులను కాంచి మన
మనసులు చలించినవి
జనకుల విషాదకర
విదిన హృదయమ్ముల్
కదలినవి శోకమున
..
కనిపించి కార్యమున
జనకు భువనమ్ముల్ !"

దీనిమీద అభిప్రాయం వెలిబుచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు చెప్పినట్లు ఈ కావ్యంలోని గూఢార్థం చాలా దురూహ్యంగా ఉన్నది. ఆ నిర్దిష్టములు, అస్పష్టములు అయిన సాంకేతికపదాలు వాడడమే ఈ అస్పష్టతకు కారణం ఎంతో సహనంతో పరిశీలిస్తే తప్ప ఈ రచన అంతరార్థం బయటపడడం కష్టం

ఈ కావ్యం రచయితకు గల ప్రాచీనాధునాతన భావాల మీద అభిమానం నిగూఢంగా వ్యక్తం చేస్తున్నది అయితే ఇది అభ్యుదయదృక్పథం అభిమానించే రచన

'శాస్త్రి'



## నాటికా గుచ్ఛము

శ్రీ వి. రామకృష్ణరావు. టీచర్, జయహింద్ సెకండరీస్కూల్ మచిలీపట్నం వెల ఒక రూపాయి.

దీనిలో 1 అడవి పువ్వులు, 2 ప్రాత క్రొత్తలు 3 స్నేహఫలం, 4 అనుకోని ఆనందం, 5 కాలభటుడు అని 5 నాటికలున్నాయి

ఈ రోజుల్లో పాఠశాలలలో విద్యార్థులు ప్రదర్శించడానికి అనువయిన చిన్న చిన్న నాటికలు చాలా స్వల్పంగా ఉన్నాయి.

అంతగా వ్యయ ప్రయాసలు లేకుండా స్వల్ప వ్యవధిలో విద్యార్థులు సులభంగా ప్రదర్శించుకోడానికి అనువయిన నాటికల గుచ్ఛమిది.

## పురమందిరము

శ్రీ వి. రామకృష్ణరావు, టీచరు జయహింద్ సెకండరీస్కూల్ మచిలీపట్టణం వెల ఒకరూపాయి.

ఇది పాఠశాల విద్యార్థులకే కాక పెద్దలకుకూడా ప్రదర్శించడానికి తగినయిన సాంఘిక నాటకం దీనిలో రచయిత సందర్భానుసారంగా పద్యాలే కాక పాటలు కూడా చేర్చారు గ్రామసేవాభిలాష, కళాభిమానము మున్నగు విషయాలపై అభిమానం పెంపొందించే లక్ష్యంతో ఈ చిన్న నాటక రచన సాగింది.

## నీవు—నేను

శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి వంద్యాల వెల లేదు.

ఇది ప్రాంజలి, ప్రార్థన, ప్రియతమునకు మొదలయిన 15 ఖండకావ్యాల సంపుటి దీనిలో కథాఖండ కావ్యాలుకూడా ఉన్నాయి.

ఈ కావ్యాలలో అంతటా భాషాశుద్ధి, సంస్కృతాంధ్ర పాండితి, సంప్రదాయ విజ్ఞానము అనల్పంగా గోచరిస్తున్నాయి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1 Editor S. Sambhu Prasad